Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)
స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు  స్థాపితం: 1930  జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి
*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 83 • సంచిక: 34 • 23-8-2013 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-

జమీన్‌రైతు
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190

జీవిత చందా రూ.1000లు
సంవత్సర చందా
స్వదేశంలో రూ.200లు
విదేశాలకు రూ.1000లు



## కాంగ్రెస్ అధిష్టానానికి కొరుకుడుపడని

# సిఎం కిరణ్‌కుమార్‌రెడ్డి వైఖరి!

రాష్ట్ర విభజన వివాదంలో ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి పాత్ర అందరికీ ఆశ్చర్యం కల్గిస్తున్నది. కాంగ్రెస్ సంస్కృతీ సాంప్రదాయాలకు భిన్నంగా అధిష్టానాన్ని వ్యతిరేకిస్తున్నాడాయన. ధిక్కరిస్తున్నాడని కూడా అనవచ్చు. కిరణ్‌కుమార్‌రెడ్డి ప్రజాదరణ వున్న నాయకుడు కాదు. స్వంత వర్గం వున్న వాడు కాదు. ముఖ్యమంత్రి అయిన తర్వాత కూడా ఆయన స్వంత జిల్లాలోనే కాంగ్రెస్ ఎమ్మెల్యేలు ఆయన్ను లెక్క చేయలేదు. ఎటువంటి ప్రజా ఉద్యమంలో పాల్గొన్నవాడు కూడా కాదు. తన తండ్రి వారసత్వంగా వచ్చిన శాసనసభ స్థానంలో గెలవడం తప్ప ఆయనకంటూ ప్రత్యేక రాజకీయ చరిత్ర, ప్రాధాన్యత లేవు. అటువంటి సాధారణ వ్యక్తి కాంగ్రెస్ అధిష్టానాన్ని ప్రశ్నించే స్థాయిలో ప్రవర్తించడం నిజంగా సంచలనమే.

కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ తెలంగాణ అనుకూల నిర్ణయం తీసుకొంటుందని కలలో కూడా వూహించలేదు కిరణ్‌కుమార్‌రెడ్డి. ముఖ్యమంత్రి పదవిలో వున్న తనను విశ్వాసంలోకి తీసుకోకుండా ఇంతటి కీలక నిర్ణయం వెలువడుతుందని వూహించలేదు. తెలంగాణ ఏర్పాటు ఆయనకు ఇష్టం లేదు. కిరణ్ చదువు సాములన్నీ హైదరాబాదులోనే జరిగాయి. ఆ నగరంతో ఆయనకు మానసిక అనుబంధం జాస్తి. ఆయన తెలంగాణ విభజన వ్యతిరేకించడానికి అదొక కారణం.

అయితే ముఖ్యమంత్రి పదవి మానసిక అనుబంధాల కంటే అధికమైంది. కాంగ్రెస్ అధిష్టానాన్ని ధిక్కరించి, పదవిలో కొనసాగిన నేత చరిత్రలో ఎవరూ లేరు. కానీ కిరణ్‌కుమార్‌రెడ్డి ఢిల్లీ పెద్దల కంట్లో నలుసువలె తయారయ్యాడు. ఏ మాత్రం వెరపు, తడబాటు లేకుండా సమైక్యాంధ్ర నినాదాన్ని పలవరిస్తున్నాడు. రాష్ట్రంలో ఉద్యమం ఈ స్థాయిలో పెరగడానికి కారణం ఆయన పరోక్ష సహకారమే అని అందరికీ తెలుసు. తన క్యాంప్ కార్యాలయంలోనే సమైక్యాంధ్ర ఎమ్మెల్యేల సమావేశాలు జరిపి, ఉద్యమ

కొరవ 14వ పేజీలో

# పైసాకు కొరగాని రూపాయి

డాలరుతో రూపాయి విలువ రోజు రోజుకూ పతనమై పోతున్నది. పాతాళానికి పడి పోతున్నది. ఈ దిగజారుడు ఇంతటితో ఆగదని అందరూ అంగీకరిస్తున్నారు. కొందరి అంచనా 70 రూపాయల వద్ద నిలుస్తుందని. మరికొందరు నిరాశావాదులైతే 100 రూపాయల అంచు తాకడం ఖాయమని వూహిస్తున్నారు. కేంద్ర ప్రభుత్వం, రిజర్వు బ్యాంక్ ఈ పతనానికి అడ్డుకట్ట వేయాలని శతవిధాలా ప్రయత్నం చేస్తున్నాయి. కానీ ఫలించడం లేదు.

డాలరు ఖరీదుగా మారితే ఏమౌతుందన్నది ప్రశ్న. అంతర్జాతీయ వాణిజ్యం అంతా డాలరు మారకంతోనే నడుస్తుంది. డాలరు ఖరీదు పెరిగే కొద్దీ దిగుమతి చేసుకోవాల్సిన వస్తువుల ధరలు పెరిగిపోతాయి. ముఖ్యంగా పెట్రోల్. మన దేశం పెట్రోల్ అవసరాలలో నూటికి 80శాతం దిగుమతుల మీదనే ఆధారపడుతున్నాము. రూపాయి పతనం ఇదే ప్రకారం కొనసాగితే పెట్రోల్, డీజిల్ ధరలు లీటరు వంద రూపాయలకు చేరుకోవడానికి ఎంతోకాలం పట్టదు. అదే జరిగితే రవాణా ఖర్చులు పెరిగిపోతాయి. బస్సు, రైలు ఛార్జీలు పెరుగుతాయి. డీజిల్ ఆధారిత పరిశ్రమలు తమ ఉత్పత్తుల ధర పెంచక తప్పదు. చివరకు మొబైల్ ఫోన్ ధరలు కూడా డీజిల్‌తో ముడిపడి వుంటాయంటే, పెట్రోల్ ధరల పెరుగుదల సామాన్య జనాన్ని ఎంతగా ప్రభావితం చేస్తాయో అర్థం చేసుకోవచ్చు.

జమీన్‌రైతు

రూపాయి విలువ పతనంతో వడ్డీ రేట్లు పెరిగిపోతాయి. ద్రవ్యోల్బణం చుట్టుముడుతుంది. పరిశ్రమల లాభదాయకత క్షీణిస్తుంది. అంతర్జాతీయ మార్కెట్‌లో మన ఉత్పత్తులు పోటీ పడలేవు. దానితో పరిశ్రమలు మూతపడతాయి. దానివల్ల నిరుద్యోగం మరింత పెరిగిపోతుంది. ఒక ప్రక్క పెరిగిన ధరలు, మరొకప్రక్క వున్న ఉద్యోగాల నుంచి ఉద్వాసన, కొత్త ఉద్యోగాలు దొరకని దుర్భర పరిస్థితితో ప్రజల జీవితం విధ్వంసమైపోతుంది.

ఎందువల్ల రూపాయి పతనం? మన్మోహన్‌సింగ్ చేసిన ఆర్థిక సంస్కరణల ప్రయోగం విఫలం కావడం వల్లనే ఈ దుర్గతి. ఆర్థిక పరిస్థితి దిగజారుతున్నదనే అనుమానం రాగానే షేర్ మార్కెట్ నుంచి విదేశీయులు తమ పెట్టుబడులు ఉపసంహరిస్తున్నారు. జూన్, జూలై నెలలో షేర్ మార్కెట్ నుంచి 63వేల కోట్ల రూపాయల పెట్టుబడులు విదేశాలకు వెనక్కు వెళ్ళి పోయాయి. ఉత్పాదక రంగంలో దాదాపు లక్ష కోట్ల రూపాయలు పెట్టుబడి పెడతామని ముందుకు వచ్చిన పోస్కో మిట్టల్ కంపెనీలు భూసేకరణలో జాప్యం, పర్యావరణ అనుమతులలో వేధింపులతో తమ ఆలోచన మానుకొన్నాయి. వారి చేదు అనుభవం చూసి కొత్తగా ఎవరూ ముందుకు రావడం లేదు.

దీని నుంచి బయట పడేదెట్లా? ఈ దుర్గతి నుంచి దేశాన్ని కాపాడడానికి కేంద్ర ప్రభుత్వం ఎన్నో చర్యలు చేపడుతున్నది. బంగారు దిగుమతులు, విదేశాల నుంచి తెచ్చుకొనే టెలివిజన్ల వంటి వాటి మీద భారీ పన్ను విధించింది. మన దేశస్థులు విదేశాలలో పెట్టుబడులను నియంత్రిస్తున్నది. కొత్త పెట్టుబడుల కోసం రక్షణ రంగానికి కూడా తలుపులు తెరిచింది. అయినా విదేశాలకు మన మీద నమ్మకం కల్గడం లేదు. ఈ అపనమ్మకం ఎంత దూరం వెళ్లిందంటే, కేంద్ర ప్రభుత్వం 8.5 శాతం వడ్డీతో జారీ చేసిన దీర్ఘకాలిక బాండ్లను కొనడానికి ఎవరూ ముందుకు రాలేదు. అమెరికాలో వడ్డీ శాతం కేవలం 2.8 మాత్రమే. అయినా అక్కడివారు ఇక్కడ తమ డబ్బు దాచుకోవడానికి భయపడుతున్నారు.

పరిస్థితి చూస్తుంటే 1991లో అప్పుల మీద వడ్డీ కట్టడానికి బంగారు తాకట్టు పెట్టిన అవమానకర పరిస్థితి గుర్తుకు వస్తున్నది. అంత భయం లేదని కౌశిక్ బసు వంటి ప్రఖ్యాత ఆర్థికవేత్తలు ధైర్యం చెప్తున్నారు. కానీ ప్రజలలో మాత్రం తీవ్ర భయాందోళనలు నెలకొంటున్నాయి. దీని నుంచి దేశాన్ని గట్టెక్కించవలసింది కేంద్ర ప్రభుత్వం మాత్రమే. అందుకు ప్రజల సహకారం తీసుకోవడం అవసరం. ప్రజల వద్ద వున్న లక్షల కోట్ల రూపాయల విలువైన బంగారును దేశ ఆర్థిక పునరుజ్జీవనానికి వాడుకొనే పథకాలు ప్రవేశపెట్టాలి. విదేశాలలో వున్న భారతీయుల నుంచి డాలర్ల డిపాజిట్లు సేకరించడానికి ప్రత్యేక ఆకర్షణలు ప్రవేశపెట్టాలి. పెట్రోల్ కొనుగోళ్లు డాలర్లతో కాక, రూపాయి మారకంతో అమ్మడానికి సిద్ధంగా వున్న ఇరాన్ వంటి దేశాల వైపు చూడాలి. ముడి ఇనుము వంటి ఖనిజాలను అత్యవసర ప్రాతిపదిక మీద ఎగుమతి చేయాలి. మన పరిశ్రమలకు ప్రోత్సాహకాలు ఇచ్చి ఎగుమతులు పెంచాలి. ప్రజల సహకారం తీసుకోగల్గితేనే ఈ గడ్డు సమస్య నుంచి దేశం బయటపడుతుంది.

## జనవాణి

### సీమాంధ్రకు సమస్యల పేకేజి మోత!

ఎన్నికల కంగారుతో కేంద్రంలోని కాంగ్రెస్ ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ విభజనకు గ్రీన్ సిగ్నల్ ఇవ్వడంలో తెలంగాణ రాష్ట్రం సాకారమయ్యే సమయం దగ్గర పడింది. కర్ణుడు చావుకు పలువురు కారణమన్నట్లు సమైక్యాంధ్ర విభజనకు అన్ని రాజకీయ పార్టీలు తిలాపాపం తలా కొంత మూట కట్టుకొన్నాయి. సమైక్య రాష్ట్ర ఆవిర్భావానికి ఆది నుండీ ఎదురు దెబ్బలే. కొండా, వెంకట రంగారెడ్డి ప్రభృతులు విశాలాంధ్రకు మోకాలడ్డగా, కెసిఆర్ పదవీ లాలసతో జనాన్ని రెచ్చగొట్టి రాష్ట్ర విచ్ఛిన్నతికి అంత్యక్రియలు జరిపిస్తున్నారు. ఐదు పదులు దాటిన ఆంధ్రప్రదేశ్ చరిత్ర వేర్పాటు వాదుల కుట్రలు, ద్రోహ చింతనలకు క్రీడా స్థలి కావడం దురదృష్టకరం. వైఎస్ఆర్ దర్శకత్వంలో రూపుదిద్దిన తెలంగాణ, శాసనసభ్యుల వేర్పాటు మహజరు, బిజెపి రెండు నాల్కల ధోరణి, చంద్రబాబు కేంద్రానికి పంపిన టిడిపి సానుకూల పత్రం, సిద్ధాంతాలను గాలి కొదిలిన సిపిఐ తీరు, టిఆర్ఎస్– జగన్ పార్టీల పీఠాధిపత్య ఏకసూత్ర ప్రణాళికలు, కేంద్రం నిర్ణయంలో జరిగిన జాప్యం, నాన్చుడు, నిష్క్రియ, బుట్టదాఖలైన శ్రీకృష్ణ కమిటీ నివేదిక, చిదంబర రహస్యాలు వగైరా చేష్టలు వేర్పాటు శక్తులను బలోపేతం చేశాయి. వైఎస్ తర్వాత సమర్ధుడైన పాలకుడు రాకపోవడం, కాంగ్రెస్ అధిష్ఠానం పనుపున వచ్చే పరిశీలకుల అనాలోచిత సలహాలు, విలీన సంప్రదింపులు కూడా సమస్యను మరింత జటిలపర్చాయి. ఇటీవల ఢిల్లీలో చకచకా దిగ్విజయంగా జరిగిన తెలుగువాడు కానరాని నిర్ణయాత్మక సమావేశాల్లో ఓట్లు – సీట్లు యావలోపడి కాంగ్రెస్ పెద్దలు అకాలంగా తెలంగాణ తేనెపట్టును రేపి మహనీయుల త్యాగాలతో ఏర్పాటైన తొలి భాషా ప్రయుక్త రాష్ట్రాన్ని ముక్కలు చేసి వేర్పాటువాదుల పదవీ దాహార్తిని తీర్చేవిధంగా భస్మాసుర వరాలివ్వడం ఆ చేతులతోనే సమస్యల ప్యాకేజి మోతను సీమాంధ్రుల కనుగ్రహించి, వారి నడుములు విరవడంతో యావత్తు రాయలసీమ, సీమాంధ్ర అగ్నిగుండంగా మారింది.

ఎం.రామ్మూర్తి విశాఖపట్నం

### నయా ధనస్వాముల చేతుల్లో గ్రామ స్వరాజ్యం!

ప్రభుత్వ అధికారుల చేతుల్లో ఉన్న గ్రామ పంచాయతీల పాలన న్యాయస్థానాల మొట్టికాయలతో ఎన్నికలు జరిగి ఎన్నుకోబడిన పాలక వర్గాల చేతుల్లోకి వచ్చింది. అయితే ఎన్నికలు జరిగిన తీరు ప్రజాస్వామ్యాన్ని అపహాస్యం చేసింది. ప్రపంచీకరణ నేపథ్యంలో దేశంలో వేగవంతంగా జరుగుతున్న నూతన ఆర్థిక సంస్కరణ ఫలితంగా పార్లమెంటు, శాసనసభలకు ప్రతినిధులుగా పరిశ్రమాధిపతులు, కాంట్రాక్టర్లు, రియల్టర్లు, నేరచరితులు, అల్పసంపాదనాపరులు, అవినీతిపరులు, బహుళజాతి కంపెనీల ఏజంట్లు, ఎన్నికవడం చూస్తున్నాం. వారు మంత్రులవుతున్నారు. ఈ నేపథ్యంలో రాష్ట్రంలో జరిగిన పంచాయతీ ఎన్నికలు వాటికి భిన్నంగా జరగలేదు. ఏకగ్రీవం పేరుతో రాష్ట్రంలో ఎన్నికైన పలు

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

27-8-1943
పేజీలు:4 వెల: 1-1-6

### విఆర్ కాలేజి ప్రిన్సిపాల్ అధికార దౌష్ట్యం

తొండముదిరి ఊసరివిల్లి అయినట్లవుతున్నది. విఆర్ కాలేజి పరిస్థితి ఆదిలో రగ్బీ యాటన్ స్కూళ్ల ప్రతిష్ఠ దీనికి కొంత ఉండింది.

అదిపోతే పోయిందిగాని ప్రిన్సిపాల్ పుణ్యాన కమిటీ చచ్చుతనం వల్ల ఇక కొన్ని దినాలకు అపకీర్తి పాలౌతుంది. కమిటీకి ఆర్భాటపు ఆరాటమే గాని కార్యసాధనగాని అధికార పాలన గాని లేనందున క్రింది ఉద్యోగస్తులకు చులకనై బయటవారి నగుబాట్లకు కారణం అయింది.

ప్రెసిడెంటు ఏ.సి.సుబ్బారెడ్డి గారిది 'అరవై మైళ్ల గలభా – ఆరు మైళ్ల స్పీడు' అన్న మోటారు పంథా. గలభా లేవదీస్తారు గాని, చివరకు నీళ్ల పాకానికి దిగుతాడు. పాపం ఆయన ఏం చేస్తాడు లెండి. అనుయాయులు తక్కువ – వున్నవారు మెతక.

### ప్రిన్సిపాల్ సంగతి దావదం

ఈ వూబతనం చూచుకొనే ప్రిన్సిపాల్ ఎగసికం పడుతున్నారు. చూడండి – భీమసేనరావు ఉద్యోగపర్వం – రావు అభినవబిల్వాణీయం ఆడబోయి గుంటూరు కాలేజిలో డిస్మిస్ అయిన పురాణ పురుషుడు.

ఆయన కర్మకాండను మఖ్యపరచిన ప్రిన్సిపాలును అండమాన్సుకు పంపవలసి వుండగా ఆదరిస్తున్నారు. ఇక ఈ కమిటీని చూస్తే ఈ పాల్ ఎందుకు జంకాల?

## 50 ఏళ్ల క్రితం ఈవారం

23-8-1963
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### పశు సంపదనలో ప్రథమ స్థానం

పశు సంపదలో ప్రపంచంలో భారత దేశానిది ప్రథమ స్థానం. 1951లో 19కోట్ల 86లక్షలుండిన పశు సంపద, 1963కు 22 కోట్ల 68లక్షలకు పెరిగింది. ఇందులో 7 కోట్ల 6లక్షలు పనిజేసే ఎద్దులు, 5 కోట్ల 10లక్షల ఆవులు; 2 కోట్ల 42లక్షల బర్రెలు వున్నవి.

కాని పశుసాంద్రతలో గాని, జనాభా నిష్పత్తిలో గాని ఇండియాకు ప్రథమ స్థానం రాదు. డెన్మార్కులో 100 హెక్టార్ల (షుమారు 250 ఎకరాలు)కు 79 పశువులుంటే, ఇండియాలో 49 మాత్రమే వున్నవి. న్యూజిల్యాండు, అర్జెంటీనా, ఆస్ట్రేలియాలలో 100 మంది మనుషులకు వరుసగా 253, 218, 160 పశువుల వంతున వుంటే, ఇండియాలో 37 మాత్రమే వున్నవి.

### విద్యార్థి ఆత్మహత్య!

నెల్లూరులోని 'లక్ష్మీ లాడ్జి'లో ఇస్కపల్లి గ్రామస్తుడు, 20ఏండ్ల యువకుడు ఎన్.కృష్ణారావు 13తేది రాత్రి ఎండ్రిన్ త్రాగి ఆత్మహత్య చేసుకున్నాడట.

ఇతను 13తేది రూము బాడుగకు తీసుకున్నాడని, 14తేది మధ్యాహ్నం వరకు తలుపు తీయకుండడం జూచి పోలీసుకు రిపోర్టు చేశారని, పోలీసు వచ్చి తలుపులు తెరచి చూడగా చనిపోయి వుండినాడని, అతని మంచం క్రింద ఎండ్రిన్ డబ్బా వుండినదని, తన చావుకు తానే బాధ్యుణ్ణని అతను వ్రాసి వుంచుకొన్న చీటీ కూడా దొరికిందని తెలుస్తున్నది. ఈ విద్యార్థి పియుసికి సెప్టెంబరు పరీక్ష చదువుతున్నాడట.

భగ్నప్రేమ ఇతని ఆత్మహత్యకు కారణంగా వుంటుందని పోలీసు అనుమానం.

# నెల్లూరు ముచ్చట్లు

## జిఎస్ఎల్‌వి డి-5 ఎగురలేదు!

శ్రీహరికోటలోని షార్ అంతరిక్ష కేంద్రం నుంచి నింగిలోనికి దూసుకుపోవాల్సిన జిఎస్ఎల్‌వి డి-5 రాకెట్ ప్రయోగం వాయిదా పడింది. 19వ తేది సాయంత్రం ఈ రాకెట్‌ను నింగిలోనికి పంపేందుకు రెండు గంటల ముందు సాంకేతిక లోపం తలెత్తి ద్రవ ఇంధనం లీకేజి అవుతుండడాన్ని శాస్త్రవేత్తలు కనుగొన్నారు. ఇదేం చేయదని తొలుత భావించినా రాకెట్ మొదటి దశ స్ట్రాపాన్ మోటర్ల వరకు ఈ లీకేజి చేరి పొగలు రావడంతో ప్రమాదమని గ్రహించిన శాస్త్రవేత్తలు వెంటనే కౌంట్‌డౌన్ ప్రక్రియను నిలిపివేశారు.

ఏది ఏమైనా ఇస్రోకు జిఎస్ఎల్‌వి రాకెట్ ప్రయోగాలు అచ్చి రావడం లేదు. ఇప్పటి వరకు ఇక్కడ నుంచి ఏడు ప్రయోగాలు జరిగితే మూడు మాత్రమే విజయవంతమయ్యాయి. జిఎస్ఎల్‌విలో క్రయోజెనిక్ ఇంజన్ కీలక పాత్ర వహిస్తుంది. దీన్ని ఇది వరకు రష్యా ఇచ్చేది. ప్రస్తుతం స్వదేశీ పరిజ్ఞానంతో తయారుచేసిన క్రయోజెనిక్ ఇంజన్‌తో జిఎస్ఎల్‌వి నింగిలోకి పంపాల్సి వుంది.

## మునిసిపల్ ఎన్నికలుంటాయా?

సమైక్యాంధ్ర ఉద్యమం సీమాంధ్రలో ఉవ్వెత్తున ఎగిసి పడుతుంది. ఈ సమయంలో మునిసపల్ ఎన్నికలుంటాయా? ఉండవా?? అనే చర్చ జరుగుతుంది. కానీ రాష్ట్ర మునిసిపల్ వ్యవహారాల మంత్రి మానుగుంట మహీధర్ రెడ్డి మాత్రం సెప్టెంబర్ నెలాఖరులో మునిసిపల్ ఎన్నికలుంటాయని కావలిలో కాంగ్రెస్ పార్టీ శ్రేణులతో 17వ తేది చెప్పడంపై విస్తృత చర్చ జరుగుతుంది. ప్రస్తుతమున్న ఉద్యమపథ నేపథ్యంలో ఎన్నికలను ప్రభుత్వం జరుపగలదా?



## సోదరులవి కల్లబొల్లి మాటలు!

సమైక్యాంధ్ర ఉద్యమానికి మద్దతు ఇవ్వక ఆనం వివేకానందరెడ్డి, రామనారాయణరెడ్డి కల్లబొల్లి మాటలు చెబుతున్నారని వారి సోదరుడు జయకుమార్ రెడ్డి విమర్శించారు. సమైక్యాంధ్రకు మద్దతుగా ములుమూడి బస్టాండ్‌లో ఏర్పాటు చేసిన దీక్షా శిబిరాన్ని సందర్శించి మాట్లాడారు. ఆర్థిక మంత్రి రామనారాయణ రెడ్డి రాజీనామాలు అవసరం లేదు. అసెంబ్లీలో తెలంగాణ తీర్మానం వీగిపోయేలా చేస్తానంటాడు. వివేకానందరెడ్డి మాత్రం గత ఏడాదిగా సమైక్యాంధ్రకు 'జై' అంటూ ఇప్పుడు వెనకడుగు వేస్తున్నాడు. సోదరులిద్దరూ కల్లబొల్లి కబుర్లు మాని సమైక్యాంధ్ర ఉద్యమంలో పాలు పంచుకోవాలని జయకుమార్‌రెడ్డి సలహా యిచ్చారు.

## సాంబారు ఎర్రగడ్డలే రూ. 60!

నెల్లూరీయులకు కూరలో ఎర్రగడ్డలు ఎక్కువగా వాడడం అలవాటు. ఇటీవల వీటి ధర కిలో 80 రూపాయలు చేరుకోవడంతో తల్లడిల్లి పోతున్నారు. 80 రూపాయలు వెచ్చించినా నెల్లూరు మార్కెట్‌లో పచ్చి సరుకే దొరుకుతుంది. ఎసి కూరగాయల మార్కెట్‌లో కిలో 5 రూపాయలకు దొరుకుతుండిన సాంబారులో వాడే చిన్న ఎర్రగడ్డలు ప్రస్తుతం 60 రూపాయలు అమ్ముతున్నారు. పైపెచ్చు తూకంలో మతలబు ఎసి మార్కెట్ స్పెషాలిటీ. విపరీతమైన రేటుకు అమ్ముతూ కూడా తూకం తక్కువగా ఇవ్వడం న్యాయమా? ధర్మమా??

## ఇన్‌ఛార్జీల ఎజెసి!

జిల్లా అధికారులకు సంబంధించి ఏ పోస్టు ఖాళీ అయినా వెనువెంటనే అదనపు జాయింట్ కలెక్టర్ చల్లా పెంచలరెడ్డిని ఆ పోస్టులో ఇన్‌ఛార్జీగా నియమిస్తున్నాడు కలెక్టర్. ఇప్పటికే కార్పొరేషన్ ప్రత్యేకాధికారిగా, జడ్పీ సిఇఓగా, జిల్లా పంచాయతీ అధికారిగా వ్యవహరిస్తున్న ఆయన ఈ వారమంతా ఇన్‌ఛార్జ్ జాయింట్ కలెక్టర్‌గా వ్యవహరిస్తారు. జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతం శ్రీలంకకు విహారయాత్రకు వెళ్లను ప్రభుత్వం అనుమతిచ్చింది. ఆయన వచ్చేవరకు పెంచలరెడ్డి గారే జాయింట్ కలెక్టర్ బాధ్యతలు సైతం నిర్వర్తిస్తారు.



## నిరాహారదీక్షలో ప్రసన్న, రామకృష్ణ!

రాష్ట్ర విభజనను వ్యతిరేకిస్తూ కోవూరు ఎమ్మెల్యే నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి కోవూరు మైథిలీ థియేటర్ సెంటర్‌లో, వెంకటగిరి ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ వెంకటగిరిలో 19వ తేది ఆమరణ నిరాహారదీక్షలకు కూర్చొన్నారు. వీరిద్దరి దీక్షలను జిల్లా యంత్రాంగం భగ్నంచేసే అవకాశం వుంది.

**చందాదారులకు మనవి**

- ☞ చందా పంపించేటప్పుడు తమ చందా నెంబరు, పూర్తి పేరు, చిరునామా తెలియపరచండి.
- ☞ మీ చందా నెంబరు, చందా ఏ తేదికి అయిపోతుందో, అడ్రసు రేపరు మీదనే ముద్రించి వుంటుంది.
- ☞ 'జమీన్‌రైతు' చందాదార్లు తమ చందాను ఎం.ఓ/డి.డి లేదా Onlineలో ఆంధ్రాబ్యాంక్, విఆర్‌కాలేజి బ్రాంచి, నెల్లూరు అకౌంట్ నెంబర్: 106811011000423లో ZAMINRYOT పేరుతో జమచేయవచ్చు. సకాలంలో చందా చెల్లించవలసినదిగా కోరుతున్నాము.
- ☞ చెక్కులు స్వీకరించబడవు.

**జీవిత చందా రూ.1000/-**

**సంవత్సర చందా**
స్వదేశంలో రూ.200/-
విదేశాలకు రూ.1000/-

**జమీన్‌రైతు**
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190

## ఎంసెట్ కౌన్సిలింగ్‌లో రగడ

నెల్లూరులో 19వ తేది ప్రారంభమైన ఎంసెట్ కౌన్సిలింగ్ జరగకుండా విద్యార్థి సంఘాలు అడ్డుకొన్నాయి. వెంకటేశ్వరపురం, దర్గామిట్టలోని బాలికల పాలిటెక్నిక్ కాలేజిల్లో ఈ కౌన్సిలింగ్‌ను పాలిటెక్నిక్ సిబ్బంది కాకుండా జిల్లా అధికారులే స్వయంగా నిర్వహించను కూర్చోవడంతో విద్యార్థి సంఘాలు అడ్డుకొనే ప్రయత్నం చేయగా పోలీసులు వారందరినీ అరెస్ట్‌చేసి పోలీస్ స్టేషన్లకు తరలించారు. ఈ కౌన్సిలింగ్ నిర్వహణకు స్వయంగా కలెక్టర్ శ్రీకాంత్, ఎస్పీ రామకృష్ణ రంగంలోకి దిగాల్సి వచ్చింది. జిల్లాలో సమైక్యాంధ్ర ఉద్యమ ఉధృతిని ఎస్పీ రామకృష్ణ తనకున్న అనుభవంతో తెలివిగా గొడవలు జరగకుండా ఒక పద్ధతి ప్రకారం అణచి వేస్తున్నారు.



సమైక్యాంధ్రకు మద్దతుగా వెంకటగిరిలో ఆమరణ నిరాహార దీక్ష చేస్తున్న ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ. దీక్షా శిబిరంలో మాట్లాడుతున్న తెలుగుదేశం పార్టీ పొలిట్ బ్యూరో సభ్యుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి.

## సోమశిలకు నీళ్లు!

జిల్లాలో వర్షాలు పడకపోయినా సోమశిల ప్రాజెక్ట్‌కు పై నుంచి నీళ్లు రావడంతో ఎనిమిది టిఎంసిలు నిల్వ ఉన్న నీళ్లు 17 టిఎంసిలకు పెరిగాయి. కృష్ణ వరద నీటిని కాసిన్ని వదిలేలా ప్రభుత్వ పెద్దలు చొరవ తీసుకుంటే సోమశిలలో మొదటికారుకు నీళ్లు సిద్ధంగా వుంటాయి.

## కోర్టులకు వెళ్లని న్యాయవాదులు

సమైక్యాంధ్ర ఉద్యమానికి మద్దతు తెలుపుతూ న్యాయవాదులు జిల్లాలో కోర్టులకు హాజరుకావడం లేదు. ఈ నెల 31వ తేది వరకు కోర్టులకు వెళ్లమని నెల్లూరు బార్ అసోసియేషన్ కార్యదర్శి రామిరెడ్డి చెప్పారు. ఇదిలా వుండగా న్యాయశాఖ ఉద్యోగులు సైతం 19వ తేది సమైక్యాంధ్ర ఉద్యమంలో పాల్గొంటుండడంతో కోర్టులన్నీ బోసిపోతున్నాయి. జడ్జీలు కూడా కోర్టుకి రాని పరిస్థితి ఇదే తొలిసారంటున్నారు.

## శివుని సేవకు నరసింహారావు!

నెల్లూరు ట్రంకురోడ్డులో మాడరన్ స్టోర్స్ అధినేత దొంతంశెట్టి నరసింహారావుకు శివుని సేవచేసే అవకాశం లభించింది. ఆయన మూలపేటలోని మూలస్థానేశ్వరస్వామి దేవస్థానం ధర్మకర్తల మండలి సభ్యునిగా నియమితులయ్యారు. 19వ తేది దేవస్థానంలో జరిగిన పాలక మండలి సభ్యుల అభినందన సభలో నరసింహారావును ఆయన అభిమానులు, కుటుంబసభ్యులు సత్కరించారు.

## నెల్లూరు ఫోటోగ్రాఫర్లకు అవార్డులు!

నెల్లూరు ఈనాడు ఫోటోగ్రాఫర్ హరిగంగాధర్, సాక్షి ఫోటోగ్రాఫర్ వెంకటరమణ, ఆంధ్రజ్యోతి ఫోటోగ్రాఫర్ జకీర్‌లకు ఆంధ్రప్రదేశ్ ఫోటో జర్నలిస్టుల అసోసియేషన్ రాష్ట్రస్థాయిలో నిర్వహించిన ఫోటోగ్రఫీ పోటీల్లో విజేతలుగా నిలిచారు. ముగ్గురికీ ప్రెస్ అకాడమీ ఛైర్మన్ సురేంద్ర 19వ తేది హైదరాబాద్‌లో జరిగిన ప్రత్యేక కార్యక్రమంలో బహుమతులందజేశారు.

కొరవ 14వ పేజీలో

● నెల్లూరులో కరెంట్

# మీటర్ రీడింగ్‌ల మాఫియా!



మీటర్ రీడింగ్‌లో ఎన్నో మతలబులు.

## ● కోట్లాది రూపాయలు నష్టపోతున్న ఎపిఎస్‌పిడిసిఎల్

నెల్లూరులో మీటర్ రీడింగ్‌ల మాఫియా మూలంగా ఎపిఎస్‌పిడిసిఎల్ కోట్లాది రూపాయలు నష్టపోతుంది. ఈ విషయం ట్రాన్స్‌కో ఉన్నతాధికారులకు తెలిసినా చూసీచూడనట్లు వదిలేస్తున్నారు. రూపాయి రూపాయి కూడబెట్టి విద్యుత్ బిల్లులు కట్టే వారిని మాత్రం పెనాల్టీల పేరుతో వేధిస్తూ దొంగలను వదిలేస్తూ ట్రాన్స్‌కో అధికారులు రాక్షసానందాన్ని అనుభవిస్తున్నారు. ప్రతి నెల మీటర్ రీడింగ్ తీసేందుకు కొన్ని ప్రైవేటు ఏజెన్సీలకు బాధ్యతలు అప్పగించారు. ఈ ఏజెన్సీలన్నీ ట్రాన్స్‌కోకు సంబంధించిన ఆడిటర్ల బినామీలుగా వ్యవహరిస్తున్నారు. వీరు ఈ బాధ్యతలను మరికొందరు సబ్ కాంట్రాక్టర్లకు ఇచ్చేయడంతో ఎవరు మీటర్ రీడింగ్‌లు తీస్తున్నారో ఎఇలకు కూడా తెలియని పరిస్థితులు నెలకొని ఉన్నాయి. రీడింగ్ నమోదులో 50 యూనిట్లు, 51–100, 100–300, 301–500, 500పైన యూనిట్లు కాలిస్తే బిల్లింగ్ యూనిట్ నమోదులో వేలల్లో విద్యుత్ బిల్లులు తేడా వచ్చే అవకాశం వుండడంతో మీటర్ రీడింగ్‌లు తీస్తున్న వారిని నగరంలో వందలాది వినియోగదారులు మేనేజ్ చేస్తున్నారు. ట్రంకురోడ్డులో కూడా ఈ మేనేజ్ పనిని పలువురు వ్యాపారులు సైతం చేస్తున్నట్లు తెలిసింది. మీటర్ రీడింగ్ బాధ్యతలు అప్పజెప్పిన కాంట్రాక్టర్లు జీతాలు సరిగ్గా ఇవ్వకపోవడంతో మీటర్ రీడింగ్ తీసే యువకులు స్వల్ప మొత్తాలకు గడ్డికరచి తక్కువ రీడింగులు నమోదుచేసి బిల్లులు తక్కువ వచ్చేలా చేస్తున్నట్లు తెలిసింది. ప్రతినెలా నగరంలో నాలుగు కోట్ల రూపాయలు వసూలు కావాల్సిన బిల్లుల్లో తేడాలు బాగా వస్తున్నట్లు ఇఆర్‌ఓ ఆఫీసు సిబ్బంది గమనించారు. కోట, వాకాడు మండలాల్లో కొందరు హేచరీ నిర్వాహకులు చేస్తున్న మేనేజ్ మూలంగా ఎపిఎస్‌పిడిసిఎల్ గూడూరు డివిజన్‌లో నెలకు కోటిన్నర రూపాయలకు పైగా నష్టపోతున్నట్లు తేలింది. ఇక్కడ మీటర్లు కాల్చేసి మేనేజ్ చేసే ప్రబుద్ధులు ఉన్నారు. వీరికి ట్రాన్స్‌కోలో క్రింది, పైస్థాయి సిబ్బంది సైతం సహకారం అందిస్తున్నట్లు వెల్లడై ఇటీవల కొందరిపై చర్యలకు ఉపక్రమించను ముందడుగు వేసినా రాజకీయ నేతలు అడ్డుకొన్నట్లు తెలిసింది. విద్యుత్ శాఖలో మీటర్ రీడింగ్‌ల మాఫియాపై విజిలెన్స్ అండ్ ఎన్‌ఫోర్స్‌మెంట్ శాఖ రంగంలో దిగి దర్యాప్తు చేస్తే ఇప్పటివరకు ఆ శాఖ నష్టపోయిన కోట్లాది రూపాయల వ్యవహారం బట్టబయలయ్యే అవకాశం వుంది.

# ఆంటోని కాదు – అధికారుల కమిటీ కావాలి!



## బీద రవిచంద్ర డిమాండ్

రాష్ట్ర విభజనపై ఆంటోని కమిటీ కాదని, తక్షణం అధికారులతో కూడిన కమిటీ వేయాలని తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు బీద రవిచంద్ర డిమాండ్ చేశారు. తెలుగుదేశం పార్టీ ఆఫీసులో విలేకరులతో మాట్లాడారు. సీమాంధ్ర ప్రజల జోలికొస్తే చూస్తూ ఊరుకోబోం. సీమాంధ్ర ఉద్యోగులను తరిమివేస్తామని తెలంగాణ నేతలు మాట్లాడుతున్నారు. తమ ప్రాంత ఉద్యోగులు, విద్యార్థుల జోలికి వస్తే కెసిఆర్‌తోపాటు సోనియాగాంధీనే తరిమి వేస్తామన్నారు. రాష్ట్ర విభజనకు వ్యతిరేకంగా సీమాంధ్ర ప్రాంతానికి చెందిన అన్నివర్గాల ప్రజలు ఉద్యమబాట పట్టారు. ఎవరి ప్రోద్భలం ఇందులో లేదు. ఉద్యోగులు ముక్త కంఠంతో విధులు బహిష్కరించి రోడ్ల మీదకు వచ్చి సమ్మె చేస్తుంటే కేంద్రం స్పందించడం లేదు. విభజనపై ఇంకా చర్చిస్తున్నామని దిగ్విజయ్ సింగ్ చెబుతున్నారు. సీమాంధ్రులు విభజనపై ఏమైనా మాట్లాడాలనుకొంటే బొత్స సత్యనారాయణ అపాయింట్‌మెంట్ తీసుకొని ఢిల్లీకి వచ్చి చెప్పుకోవాలని దిగ్విజయ్‌సింగ్ చెప్పడం దారుణమన్నారు. విభజనకు పరిష్కారం చెప్పండని చంద్రబాబు అడిగితే ఆయన మీద విమర్శలకు దిగడం దారుణమని రవిచంద్ర చెప్పారు. సమావేశంలో తెలుగుదేశం నాయకులు నూనె మల్లిఖార్జున్‌యాదవ్, ఒట్టూరు సంపత్‌రాజు, జలదంకి సుధాకర్, పడవల కృష్ణమూర్తి తదితరులు పాల్గొన్నారు.

# ఎస్మాకు వెరవం!

## ఎన్జీఓల సంఘ నేత రవీంద్రరెడ్డి

రాష్ట్ర ప్రభుత్వం ఎస్మాతోపాటు 171 జీవోను అమలు చేయడం ద్వారా తాము నిర్వహిస్తున్న సమైక్యాంధ్ర పరిరక్షణకు డిమాండ్ చేస్తున్న సమ్మె భగ్నానికి ప్రయత్నం చేయడం విడ్డూరంగా వుందని ఎన్‌జిఓ సంఘం జిల్లా అధ్యక్షుడు రవీంద్రరెడ్డి విమర్శించారు. ఎన్‌జిఓ హోంలో సమైక్యాంధ్ర పరిరక్షణ సమితి విద్యార్థి, ఎన్‌జిఓ జెఎసి ఆధ్వర్యంలో నిర్వహించిన సమావేశంలో పాల్గొని మాట్లాడారు. 171 జివోలో నో వర్క్ – నో పే విధానం అమలులోకి తీసుకురావాలనే తలంపు దారుణమన్నారు. ఎస్మా వంటి కఠినచట్టాన్ని ప్రయోగించినా తమ డిమాండ్ నెరవేరేవరకు వెనకడుగు వేసేది లేదని ఖరాఖండిగా స్పష్టం చేశారు. 27 సంవత్సరాల తర్వాత ఎన్‌జిఓలు సమ్మెబాట పట్టారు. మాతోపాటు 71 ఉపాధ్యాయ, ఉద్యోగ, కార్మిక సంఘాలు సమైక్యాంధ్ర ఉద్యమంలో పాల్గొంటున్నాయన్నారు. ఎపిఎస్ ఆర్టీసిలో ఎంప్లాయిస్ యూనియన్, నేషనల్ మజ్దూర్ యూనియన్ వంటి అతి పెద్ద కార్మిక సంఘాలు సమ్మెలో పాలు పంచుకొంటున్నాయని రవీంద్రరెడ్డి చెప్పుకొచ్చారు.

# వారివి 'రాజీ'నామా డ్రామాలు!



అఖిలపక్ష నిరసనలో మాట్లాడుతున్న ఎమ్పీ రాజమోహన్‌రెడ్డి.

## ● నెల్లూరు ఎమ్పీ విమర్శ

పలువురు ప్రజాప్రతినిధులు రాజీనామాలంటూ డ్రామాలు ఆడుతున్నారని నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి విమర్శించారు. రాజీనామాలు సక్రమమైన పద్ధతిలో పంపడంతోపాటు దానికి కట్టుబడి వ్యవహరించాలని అప్పుడే రాజీనామాల ఉద్దేశం నెరవేరుతుందన్నారు. రాజీనామాలు చేసిన శాసనసభ్యులు, పార్లమెంటు సభ్యులు చట్టసభలకు హాజరు కాకుండా వుంటేనే బలం చేకూరుతుందన్నారు. కానీ నేడు ప్రచారం కోసం రాజీనామాల డ్రామాలాడుతూ శాసనసభ, పార్లమెంటు సమావేశాలకు హాజరవుతూ, హాజరు పట్టీలో సంతకాలు పెడుతున్నారని తెలిపారు. ఇది ప్రజలను వంచించడమేనని విమర్శించారు. ఇటీవల నెల్లూరులో సమైక్యాంధ్ర ఉద్యమానికి మద్దతు ప్రకటించిన అనంతరం ఆయన మాట్లాడారు. తాను రాజీనామాను స్పీకర్ ఫార్మెట్‌లో పంపించడంతోపాటు ఆ మాటకు కట్టుబడి వున్నానన్నారు. పార్లమెంటు సమావేశాలకు, స్టాండింగ్ కమిటీ సమావేశాలకు హాజరు కావడం లేదని తెలిపారు. గతంలోనూ వైఎస్ రాజశేఖర్‌రెడ్డి పేరును సిబిఐ ఛార్జిషీట్‌లో పెట్టినపుడు పదవికి రాజీనామా చేశానని, అప్పుడూ పార్లమెంటులో అడుగుపెట్టలేదన్న విషయాన్ని గుర్తు చేశారు. లక్ష్యం నెరవేర్చుకొనేందుకు రాజీనామాలు చేసినప్పుడు సమైక్యాంధ్ర విషయం తేలకుండా రాజీనామాలు చేసినవారు ఎలా చట్టసభల్లో జరిగే సమావేశాలకు హాజరవుతారని ప్రశ్నించారు. కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర విభజన ప్రకటన చేసి ఘోర తప్పిదం చేసిందన్నారు. హైదరాబాద్‌పై స్పష్టత లేదన్నారు. హైదరాబాద్ నగరంలో విద్యారంగ అభివృద్ధికి ఆంధ్ర ప్రాంతీయులు ఎనలేని కృషి చేశారన్నారు. దీన్ని దృష్టిలో పెట్టుకుని సమైక్యంగా వుంచాలని డిమాండ్ చేశారు.

# చదువులు అటకెక్కాయి – జనజీవనం స్తంభన!



వీధుల్లో విద్యార్థులు.

## ● సమైక్యాంధ్ర ఉద్యమ ఫలితం

సమైక్యాంధ్ర ఉద్యమం కొనసాగుతూ వుంది. తెలుగు ప్రజలందరూ కలసికట్టుగా ఒకే రాష్ట్రంగా ఉండాలని విద్యార్థి జెఎసి, ఎన్‌జిఓలు, ఆర్టీసి కార్మిక సంఘాలు కొన్ని ఉద్యమాన్ని ఉధృతంగా నిర్వహిస్తున్నాయి. ప్రభుత్వ ఉద్యోగులందరూ బంద్‌లో పాల్గొంటుండడంతో అన్ని ప్రభుత్వ కార్యాలయాలు ఉద్యోగులు లేక ఖాళీగా దర్శనమిస్తున్నాయి. ఆర్టీసి కార్మికులు బంద్ పాటిస్తుండడంతో చాలామటుకు బస్సులు నడవడం లేదు. విద్యార్థులు తమ ఉద్యమాన్ని మరింతగా ఎగసిపడేలా చేసేందుకు విద్యార్థులతో నిరసన కార్యక్రమాలు చేపడుతుండడం, నిరవధికంగా పాఠశాలలు, కళాశాలలు బంద్ నిర్వహిస్తుండడంతో గత రెండు వారాలుగా విద్యార్థుల చదువులు అటకెక్కాయి. సమైక్యాంధ్రంటే ఏమిటో, తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం ఏమిటో తెలియని పసి పిల్లలు ఈ కారణంగా విద్యాసంస్థలు మూతపడడంతో అనుకోకుండా వచ్చిపడిన సెలవులను ఆటలాడుకొనేందుకు చక్కని అవకాశంగా భావిస్తున్నారు. మరోవైపు రవాణా వ్యవస్థ అస్తవ్యస్తమైంది. ఎప్పుడు ఎక్కడ ఎవరు ధర్నా చేస్తున్నారో, రాస్తారోకో చేస్తున్నారో, పాలాభిషేకమో, దిష్టిబొమ్మల దహనమో తెలియక నగరంలో నుంచి మరొక చోటికి వెళ్లేవారు అష్టకష్టాలు పడుతున్నారు. కూరగాయల ధరలు మండి పోతున్నాయి. వివిధ సమస్యలపై ప్రభుత్వ కార్యాలయాలకు వచ్చే ప్రజలు అక్కడ బోసిగా వెక్కిరిస్తున్నట్లుండే కుర్చీలను చూసి ఉసూరుమంటూ తిరిగి వెళ్తున్నారు. ఉద్యమ ప్రభావం ప్రజలపై ఇన్నిరకాలుగా పడుతుండడంతో పలువురు సామాన్య ప్రజలు అసహనం వ్యక్తం చేస్తున్నారు. ముందు ముందు ఈ ఉద్యమం ఏ రూపు దాలుస్తుందో, దాని ప్రభావం ఎలా వుంటుందో, ఉద్యమ ఫలితం వుంటుందో? లేదో తెలియని సందిగ్ధంలో సమస్యలు ఎదుర్కొంటున్నారు ప్రజలు.

## విష్ణు, యానాదిశెట్టిల మధ్య లడాయి!

● రెట్టించుకొన్న నాయకులు విస్తుపోయిన కార్యకర్తలు





కావలి కాంగ్రెస్ పార్టీలో వర్గ విభేదాలు మరోమారు బట్టబయలయ్యాయి. మాజీ ఎమ్మెల్యే విష్ణువర్ధన్‌రెడ్డి, మంత్రి ఆనం రామనారాయణరెడ్డి వర్గాలుగా కాంగ్రెస్ పార్టీ విడిపోయి తరచూ కుమ్ములాటలు, వాదోపవాదాలు జరుగుతున్న విషయం తెలిసిందే. ఇటీవల విష్ణువర్ధన్‌రెడ్డి అనుచరులు మంత్రి వ్యవహారశైలిపై పిసిసి అధ్యక్షుడు బొత్సా సత్యనారాయణను, ఇన్‌ఛార్జ్ మంత్రి పితాని సత్యనారాయణను కలసి ఫిర్యాదు చేసి వున్నారు. ఈ నేపథ్యంలో సమైక్యాంధ్ర ఉద్యమంలో భాగంగా బంద్ నిర్వహించే విషయంలో మరోమారు విభేదాలు పొడచూపాయి. ఆగష్టు 13న కావలిలో బంద్‌కు పిలుపునిచ్చిన మాజీ ఎఎంసి ఛైర్మన్, కాంగ్రెస్ సీనియర్ నేత గ్రంధి యానాదిశెట్టి ఆ ప్రయత్నాల్లో వుండినారు. విష్ణువర్ధన్‌రెడ్డి 12న బంద్ నిర్వహించాలన్నారు. దీనిపై ఇరువురి మధ్య వాదనలు జరిగాయి. అర్అండ్‌బి అతిథి గృహంలో కార్యకర్తలందరి సమక్షంలో గ్రంధి విష్ణువర్ధన్‌రెడ్డితో మేమే ముందుగా 13న బంద్ చేయాలని నిర్ణయించామని, మంత్రి అందుకు ఆదేశించారని చెప్పడంతో విష్ణు ఆగ్రహించారు. మీరు మాకు చెప్పి బంద్ నిర్ణయం తీసుకొన్నారా అని అనడంతో అదే స్థాయిలో గ్రంధి సమాధానమిచ్చారు. మీరు ఎప్పుడు కావలి వచ్చేది, ఎప్పుడు వెళ్లేది మాకేమన్నా తెలుస్తుందా అనడంతో ఒక్కసారిగా వాతావరణం వేడెక్కింది. ఇంతలో విష్ణు అనుచరుడు బాలకృష్ణంరాజు జోక్యం చేసుకోవడంతో వివాదం పెద్దదైంది. కేకలు అరుపులతో దద్దరిల్లిపోయింది. దీంతో కామయ్య అనే నేత కలుగజేసుకొని అందరూ చూస్తున్నారు అని చెప్పడంతో వివాదం సద్దుమణిగింది. చివరకు విష్ణు, గ్రంధి నాయకత్వంలో సంయుక్తంగా ఉద్యమం చేపట్టడం చర్చనీయాంశమయ్యింది.

## రాష్ట్ర విభజనకు చంద్రబాబు కారణం!

కావలిలో లక్ష్మీపార్వతి

తెలుగుదేశం పార్టీ అధినేత చంద్రబాబునాయుడి వైఖరి వల్లే రాష్ట్రంలో విభజన జరిగిందని ఎన్టీఆర్ టిడిపి అధ్యక్షురాలు నందమూరి లక్ష్మీపార్వతి విమర్శించారు. బాబు రాష్ట్ర విభజనకు అనుకూలమని లేఖ ఇవ్వడం వల్లే తెలుగు ప్రజల్లో చిచ్చు ఏర్పడిందన్నారు. ఇటీవల కావలి వచ్చిన ఆమె విలేకరులతో మాట్లాడుతూ చంద్రబాబునాయుడుపై తీవ్ర విమర్శలు చేశారు. ఆంధ్రుల ఆత్మగౌరవానికి ప్రతీకగా నిలచి కాంగ్రెస్ పార్టీని గద్దె దించేందుకు ఎన్టీఆర్ స్థాపించిన పార్టీకి నేతగా వున్న ఆయన తన స్వార్ధం కోసం, బిజెపి, తెలంగాణ రాష్ట్ర సమితితో పొత్తు పెట్టుకొన్నాడని దుయ్యబట్టారు. అధికారం కోసం, పదవి కోసం మామకు వెన్నుపోటు పొడిచిన చంద్రబాబు నేడు రాష్ట్రాన్ని విభజించేందుకు కారకుడయ్యాడని, తెలుగు వారి ఐక్యతలో చిచ్చుపెట్టారని ఆరోపించారు. వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ సైతం సమైక్యాంధ్ర వాదాన్ని బలంగా వినిపించ లేకపోయిందన్నారు. అనంతరం కావలి పట్టణంలో జరిగిన సమైక్యాంధ్ర ఉద్యమంలో పాల్గొని తన మద్దతు ప్రకటించారు. పొట్టి శ్రీరాములు విగ్రహానికి పూలమాల వేసి నివాళులు అర్పించారు. తాను ఎన్టీఆర్ టిడిపి అధ్యక్షురాలి హోదాలో సమైక్యాంధ్ర ఉద్యమంలో పాలుపంచుకొన్నట్లు తెలిపారు. పనిలోపనిగా ఆ పార్టీకి జిల్లా కన్వీనర్‌గా రామిరెడ్డి కృష్ణారెడ్డిని నియమిస్తున్నట్లు ప్రకటించారు. ఈ నియామకం బాగానే వున్నా అసలు రాష్ట్రంలో ఆ పార్టీ ఉనికే లేనప్పుడు ఈ నియమాకం ఏంటా అని ప్రజలు చర్చించుకొంటున్నారు.

● సమైక్యాంధ్ర

## సాధించేవరకు ఉద్యమం!

ముత్తుకూరులో ఆదాల

సమైక్యాంధ్ర సాధించే వరకు ఉద్యమం కొనసాగిస్తామని సర్వేపల్లి శాసనసభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి ప్రకటించారు. తెలుగు ప్రజలందరూ ఒకటిగా వుండాలని కోరుతూ చేపట్టిన ఈ ఉద్యమంలో విజయం సాధిస్తామని ఆశాభావం వ్యక్తం చేశారు. ముత్తుకూరులో బ్లాక్ కాంగ్రెస్ అధ్యక్షుడు ఈదూరు రామ్మోహన్‌రెడ్డి ఆధ్వర్యంలో జరిగిన సమైక్యాంధ్ర ర్యాలీలో ఆయన పాల్గొని ప్రసంగించారు. రాష్ట్రంలోని ప్రజలందరూ కలసికట్టుగా ఒకే రాష్ట్రంగా వుండాలన్నదే తమ అభిమతమన్నారు. ఇందులో విజయం సాధించే వరకు సర్వేపల్లి నియోజకవర్గంలో ఆందోళన కార్యక్రమాలను ఉధృతం చేస్తామన్నారు. దేశంలో రాష్ట్ర విభజన జరిగిన చోట గతంలో వుండే రాజధానులు విడిపోయిన రాష్ట్రాల్లో చేరలేదన్నారు. అలాంటిది హైదరాబాద్‌ను తెలంగాణలో చేర్చాలన్న నిర్ణయం సరైంది కాదన్నారు. విద్యార్థులు, ఉద్యోగులు, ఉపాధ్యాయులు చేపట్టే ఆందోళన కార్యక్రమాలకు తాను సంపూర్ణ మద్దతు ప్రకటిస్తున్నట్లు తెలిపారు. అనంతరం బస్టాండ్ సెంటర్ నుండి తహశీల్దార్ కార్యాలయం వరకు ర్యాలీ నిర్వహించి అనంతరం రోడ్డుపైనే వంటలు వండి సహపంక్తి భోజనం చేశారు. ఈ కార్యక్రమంలో విజయ డైరీ ఛైర్మన్ కొండ్రెడ్డి రంగారెడ్డి, ఈపూరు శేషారెడ్డి, వసంతకుమార్‌రెడ్డి, గిరిధర్‌రెడ్డి, తదితరులు పాల్గొన్నారు.

# చదువుతోనే అభివృద్ధి!

## మునునూరు గిరిజన సదస్సు తీర్మానం

గిరిజనులందరూ ఐక్యంగా వుంటేనే అభివృద్ధి సాధ్యమవుతుందని గిరిజన ఐక్య వేదిక పిలుపినిచ్చింది. సమస్యలను పోరాటాల ద్వారా పరిష్కరించుకొంటూ ముందుకు పోవాలని, రాజ్యాంగం కల్పించిన హక్కులను కాపాడుకోవాలని, అన్ని రంగాల్లో అభివృద్ధి చెందాలని వేదిక అభిలషించింది. మునునూరు గ్రామంలోని గిరిజన కాలనీలో చైతన్య సదస్సు జరిగింది. ఈ సదస్సును ఉద్దేశించి గిరిజన ఐక్య వేదిక అధ్యక్షుడు బాపట్ల వెంకటపతి మాట్లాడారు. ప్రభుత్వాలు ఎన్నో పథకాలను గిరిజనుల కోసం ప్రవేశపెడుతున్నా వారి బ్రతుకులు మారడంలేదని దీనికి ప్రధాన కారణం గిరిజనులు చదువుకోకపోవడమేనన్నారు. బ్రతుకులు మారాలన్నా, చీకటి తొలగి వెలుగు రావాలన్నా ప్రతి గిరిజనుడు తమ పిల్లలను బాగా చదివించాలని కోరారు. గిరిజన ప్రాంతాల్లో అభివృద్ధి పనులు చేపట్టడంలో అధికారులు, పాలకులు పక్షపాతంగా వ్యవహరిస్తున్నారన్నారు. అందువల్లే పలు గిరిజన గ్రామాల్లో త్రాగు నీటికి నోచుకోక, రేషన్‌కార్డులు అందక, పెన్షన్లు రాక సమస్యలతో జీవనం సాగిస్తున్నారని ఆవేదన వ్యక్తం చేశారు. ఇప్పటికైనా అధికారులు సమస్యలు పరిష్కరించి గ్రామాల్లో మౌలిక సదుపాయాలు కల్పించాలని లేకపోతే ఉద్యమిస్తామన్నారు. గిరిజనులకు హెల్త్ ప్యాకేజి అమలు చేయాలని, ఆరవ విడత భూ పంపిణీలో ఒక్కో కుటుంబానికి రెండెకరాలు ఇవ్వాలని డిమాండ్ చేశారు. అనంతరం ఇటీవల కావలి డివిజన్‌లో పంచాయతీ సర్పంచ్‌లుగా ఎన్నికైన గిరిజనులను సన్మానించారు.





కావలిలో ఆర్‌ఆర్ ఎసి రెస్టారెంట్‌ను ప్రారంభిస్తున్న ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు. ప్రక్కన రెస్టారెంట్ అధినేత పూనూరు రవికుమార్‌రెడ్డి, దేవరాల సుబ్రహ్మణ్యం, ఆత్మకూరు బ్రహ్మయ్య, తటవర్తి వాసు.



సమైక్యాంధ్రకు మద్దతుగా నెల్లూరులో ర్యాలీ నిర్వహిస్తున్న నెల్లూరు జిల్లా బులియన్ అండ్ డైమండ్ మర్చంట్స్ అసోసియేషన్ నాయకులు శాంతిలాల్‌జైన్, మణిలాల్‌జైన్‌లతో వ్యాపారస్తులు.

# అడవుల సంరక్షణ అందరి బాధ్యత!

## ● అటవీశాఖ డిప్యూటీ డైరక్టర్

అడవులను రక్షించుకొనేందుకు ప్రజలే పోలీసులుగా మారాలని అటవీశాఖ డిప్యూటీ డైరెక్టర్ మూర్తి రాజు పిలుపునిచ్చారు. జీవుల మనుగడకు అడవులు అవసరం అని, దీనిని ప్రతి ఒక్కరూ గుర్తెరిగి వాటిని కాపాడుకోవాలన్నారు. అటవీశాఖలో శిక్షణ పొందుతున్న సెక్షన్ అధికారులకు నిర్వహించిన ఎడ్యుకేషన్ టూర్‌లో భాగంగా ఆ శాఖ వెంకటాచలం నర్సరీని సందర్శించారు. శిక్షణ పొందుతున్న వారితో కలసి నర్సరీలో కలియతిరిగిన ఆయన ప్రజలనుద్దేశించి ప్రసంగించారు. ఓజోన్ పొరను కాపాడుకోకపోతే పర్యావరణానికి ప్రమాదం కల్గుతుందని, మానవాళికి హాని జరుగుతుందన్నారు. దీనిని దృష్టిలో వుంచుకొని ప్రతి ఒక్కరు చెట్లను నాటాలని పిలుపునిచ్చారు. అడవులు అంతరించి పోవడం పట్ల ఆందోళన వ్యక్తం చేసిన మూర్తిరాజు చెట్ల పెంపకాన్ని ఉద్యమంగా చేపట్టాలని, తమ శాఖ వారికి అండదండలందిస్తుందన్నారు. డిప్యూటీ డైరెక్టర్‌తోపాటు రేంజ్ అధికారి వెంకటేశ్వర్లురెడ్డి, సెక్షన్ అధికారి వంశీకృష్ణ, పిడి అశోక్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

# అర్హులకు భూములు పంచండి!

## పెట్లూరు దళితుల అభ్యర్థన

పేదలు భూములు సాగు చేస్తుంటే పెట్లూరులో అటవీ శాఖ అధికారులు అడ్డుకొంటున్నారని, దీనిపై న్యాయం చేయాలని దళితులు డిమాండ్ చేశారు. పెట్లూరు గ్రామస్తులు తమ గ్రామ సమస్యలపై వెంకటగిరి తహశీల్దార్ కృష్ణమూర్తిని కలసి వినతి పత్రం అందజేశారు. ఈ సందర్భంగా వారు తమ సమస్యలను ఆయన దృష్టికి తీసుకొని వెళ్లారు. స్థానిక దళితవాడ సమీపంలో వున్న భూముల్లో నిరుపేదలు, భూమిలేని వారు సాగు చేసుకొంటున్నారని తెలిపారు. అటవీశాఖాధికారులు ఈ భూములు తమ శాఖవంటూ సాగును అడ్డుకోవడమేకాక మొక్కల పెంపకం చేపట్టారన్నారు. వాస్తవానికి ఈ భూములపై రెవిన్యూ, అటవీశాఖ సంయుక్తంగా నిర్వహించిన సర్వేలో ఈ భూములు అటవీ శాఖవి కావని తేలిందన్నారు. అయినప్పటికీ ఆ శాఖాధికారులు అడ్డుపడుతూనే వున్నారని ఫిర్యాదు చేశారు. దీనిపై తగిన విధంగా స్పందించాలని, భూములను అర్హులైన పేదలకు పంపిణీ చేయాలని కోరారు. దీనికి తహశీల్దార్ స్పందిస్తూ మేత పోరంబోకు భూములను ఆక్రమించరాదని, అలా ఆక్రమించిన వారిపై చర్యలు చేపట్టమని హైకోర్టు ఉత్తర్వు ఇచ్చిందన్నారు. దీనిని దృష్టిలో వుంచుకొని ఉన్నతాధికారులతో సంప్రదించి తగిన న్యాయం చేస్తానని హామీ ఇచ్చారు.



## ● వెంకటగిరి ఆర్టీసికి

# పెరిగిపోతున్న సమ్మె నష్టం!

## నిలిచిపోయిన బస్సులు

సమైక్యాంధ్ర కోసం చేస్తున్న నిరసన ఫలితంగా వెంకటగిరి ఆర్టీసి డిపో నుంచి వివిధ ప్రాంతాలకు వెళ్లాల్సిన 40 బస్సులు నిలచిపోయాయి. ఇక్కడ నుండి 75 బస్సులు పట్టణాలు, గ్రామాలకు తిరుగుతుంటాయి. సమైక్యాంధ్ర ఉద్యమం ధాటికి ఆర్టీసి అధికారులు 40 బస్సులను నిలిపివేశారు. దీంతో ఆర్టీసికి ఆగష్టు 7వ తేది వరకు దాదాపు 5లక్షల రూపాయలకుపైగా నష్టం వాటిల్లినట్లు ఆర్టీసి డిఎం రామ్మోహన్‌రావు తెలిపారు. ఈ ఉద్యమం మరింతగా ఇలాగే కొనసాగితే బస్సుల రాకపోకలపై తీవ్ర ప్రభావం పడడంతోపాటు మరింతగా నష్టం జరిగే అవకాశం వుందని ఆయన ఆందోళన వ్యక్తం చేశారు.

# తెలుగు తమ్ముళ్ల కుమ్ములాట!

## తడలో బలహీనపడ్డారు

తడ మండలంలో జరిగిన ఒక కార్యక్రమంలో తెలుగుతమ్ముళ్లు కుమ్ములాడుకోవడం చర్చనీయాంశమయ్యింది. ఈ మండలం మొదటి నుంచి టిడిపికి కంచుకోట. ఇటీవల కాలంలో ఆ పార్టీ క్యాడర్ నేతల కారణంగా చిన్నాభిన్నం అయిపోయింది. ఈ పరిస్థితుల్లో ఇటీవల జరిగిన పంచాయతీ ఎన్నికల్లో ఆ పార్టీకి ఐదు స్థానాలు దక్కాయి. ఈ సందర్భంగా కొత్తగా ఎన్నికైన సర్పంచ్‌లకు సన్మాన కార్యక్రమాన్ని పున్నమి రెస్టారెంట్‌లో నిర్వహించారు. దీనికి శాసనసభ్యుడు పరసా రత్నం, వేనాటి రామచంద్రారెడ్డి, వేనాటి పరంధామరెడ్డి, తిరుమూరు పట్టాభిరామిరెడ్డి తోపాటు పలువురు నాయకులు పాల్గొన్నారు. సన్మాన కార్యక్రమం ప్రారంభం కాకముందే కార్యకర్తలు మాట్లాడుతూ రామాపురం పంచాయతీలో కనీసం అభ్యర్థిని నిలబెట్టలేని స్థితిలో వుండడంపై తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేశారు. దీంతో వారి మధ్య మాటామాటా పెరిగి ఒకరిపై ఒకరు కుమ్ములాటకు దిగడంతో సన్మాన కార్యక్రమం రసాభాస అయ్యింది. వీరిని శాంత పరచేందుకు, గొడవ నిలువరించేందుకు పరసా, వేనాటిలు ఎంత ప్రయత్నించినా వారి మాట వినేనాథుడు లేకుండా పోవడంతో తెలుగుతమ్ముళ్ల కుమ్ములాట మండలంలో చర్చనీయాంశమయ్యింది.

## ● మునిసిపల్ ఎన్నికలకు

# పోలింగ్ కేంద్రాలు రెడీ!

వెంకటగిరి మున్సిపాల్టీలోని 25 వార్డులకు గాను 34 పోలింగ్ కేంద్రాలను ఏర్పాటు చేశారు. త్వరలో ఎన్నికలు జరగనున్న నేపథ్యంలో అధికారులు అన్నీ ఏర్పాట్లు చేస్తున్నారు. ఆగష్టు 7న పట్టణంలో మున్సిపల్ కమిషనర్ కె.ప్రమీల అధికారులతో ఎన్నికలపై సమావేశం నిర్వహించారు. ఆమె మాట్లాడుతూ గత ఎన్నికల్లో 25 పోలింగ్ కేంద్రాలు మాత్రమే వున్నాయని, ఓటర్ల సంఖ్య పెరగడంతో మరో 9 పోలింగ్ కేంద్రాలను పెంచామన్నారు. దీనిపై ఎలాంటి అభ్యంతరాలు వ్యక్తం కాకపోవడంతో ఈ కేంద్రాలను ఏర్పాటు చేశామన్నారు. మున్సిపల్ ఎన్నికలకు సర్వం సిద్ధం చేశామన్నారు. ఈ సమావేశంలో మున్సిపల్ ఎఇ ఉమామహేశ్వరరావు, ఇతర సిబ్బంది పాల్గొన్నారు.

# రాష్ట్ర విభజనకు రాజశేఖర్‌రెడ్డే కారకుడు!



### కావలిలో బీద మస్తాన్‌రావు విమర్శ

తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర నిర్ణయానికి కారకుడు వైఎస్ రాజశేఖర్‌రెడ్డేనని కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు విమర్శించారు. ఆయన 2004లో హామీ ఇచ్చి రాజకీయంగా తనకు అనుకూలంగా మలచుకొన్నారని, ఈ ఉద్యమానికి ఆజ్యం పోశారన్నారు. తెలుగుదేశం పార్టీపై విమర్శలు చేసే ముందు కాంగ్రెస్ నాయకులు వాస్తవాలు మాట్లాడాలన్నారు. ఇరు ప్రాంత ప్రజలు బాధపడకుండా సముచిత నిర్ణయం తీసుకోమని తమ పార్టీ అధినేత చంద్రబాబు నాయుడు కోరాడే తప్ప ఎక్కడా తెలంగాణ ఇమ్మని ప్రకటన చేయలేదన్నారు. కావలి పట్టణంలో సమైక్యాంధ్రకు మద్దతుగా విద్యార్థులు నిర్వహించిన కార్యక్రమంలో ఆయన పాల్గొని మద్దతు తెలిపారు. ట్రంకురోడ్డులో వున్న పొట్టిశ్రీరాములు విగ్రహానికి నివాళులు అర్పించిన అనంతరం ఆయన మాట్లాడారు. రాజకీయాలు, కుల, మత వర్గ విభేదాలు ప్రక్కన పెట్టి సమైక్యాంధ్ర కోసం పోరాడాలని పిలుపునిచ్చారు. తెలుగు ప్రజలందరూ ఒకటిగానే వుండాలంటూ పెద్దఎత్తున ఉద్యమం చేస్తుంటే కాంగ్రెస్ నాయకులు ఎక్కడ దాక్కుని వున్నారని ప్రశ్నించారు. తక్షణం ముఖ్యమంత్రితోపాటు, స్పీకర్, మంత్రులు తమ పదవులకు రాజీనామా చేయాలని డిమాండ్ చేశారు. విద్యార్థి నాయకులతోపాటు తెలుగుదేశం పార్టీకి చెందిన బ్రహ్మయ్య, వాసు, సర్దార్, వెంకటేశ్వర్లు తదితరులు పాల్గొన్నారు.

# జగదేవిపేట పిహెచ్‌సిలో కుర్చీలాట!

### జాతీయ జెండా ఎగురవేయడంలోనూ పోటీ పడ్డారు

ఇందుకూరుపేట మండలం జగదేవిపేటలో గల ప్రాథమిక ఆరోగ్య కేంద్రంలో డాక్టర్ల నడుమ కుర్చీలాట నడుస్తోంది. ఆ స్థానం తమదంటే తమదని తన్నుకొంటున్నారు. చివరకు ఈ వ్యవహారం ఏ స్థాయికి వచ్చిందంటే ఆగష్టు 15న జెండా ఆవిష్కరణకు పోటీలుపడే వరకు వెళ్లింది. ఇక్కడ ప్రాథమిక ఆరోగ్య కేంద్రంలో డాక్టర్ నిరంజన్ పనిచేస్తున్నాడు. ఇతనికి, సిబ్బందికి పడక వివాదం నెలకొనడంతో ఉన్నతాధికారులు ఆయన్ను తప్పించి ఈ స్థానంలో మైపాడు డాక్టర్‌ను నియమించారు. దీనిపై నిరంజన్ న్యాయస్థానాన్ని ఆశ్రయించి తిరిగి జగదేవిపేటకు వచ్చాడు. దీనితో ఇద్దరి నడుమ వివాదం జరుగుతోంది. అధికారులు పట్టించుకోక పోవడంతో ఇరువురు వైద్యులు స్వాతంత్ర్య దినోత్సవం రోజున జెండా ఆవిష్కరణకు పోటీలు పడడం మండలంలో చర్చనీయాంశమయ్యింది.

# కావలిలో దొంగల స్వైర విహారం!

### పగలు రాత్రి తేడా లేకుండా దొంగతనాలు

కావలి పట్టణం దొంగలకు నిలయంగామారింది. ఇళ్లలో చోరీలు పగలు, రాత్రి అనే తేడా లేకుండా జరిగిపోతున్నాయి. వేసిన తాళం వేసినట్లే వుంటుంది, ఇంట్లో వస్తువులు మాత్రం దొంగతనానికి గురౌతున్నాయి. అంత చాకచక్యంగా దొంగలు తమ చోరకళను ప్రదర్శించి దొంగతనాలు చేస్తున్నా, పోలీసులు వాటిని అరికట్టడంలో విఫలమౌతుండడంతో పట్టణ ప్రజలకు దొంగల భయం పట్టుకొంది. ఎప్పుడు ఎక్కడ ఎవరింట్లో దొంగతనం జరుగుతుందోనని ప్రజలు ఆందోళన చెందుతున్నారు. వరస దొంగతనాల కారణంగా ప్రజలకు కంటిమీద కునుకు లేకుండా పోతోంది. వీటితోపాటు రౌడీలు, అల్లరిమూకలు, చిల్లర దొంగల ఆగడాలు అధికం అవుతున్నాయి. ఆర్టీసి బస్టాండు, ట్రంకురోడ్డు, తుమ్మలపెంట సెంటర్, రైల్వేస్టేషన్, క్రిస్టియన్ కాలనీల వద్ద ఈ మూకలు విచ్చలవిడిగా వ్యవహరిస్తూ, తాగి నానా గొడవలకు దిగడం, బెదిరించి నగలు, నగదు అపహరణకు పాల్పడుతుండడంతో ఈ ప్రాంతాల్లో తిరగాలంటేనే ప్రజలు భయపడిపోతున్నారు. ప్రభుత్వ హాస్పిటల్లో కొందరు రౌడీలు చేరి అక్కడి పడకలను ఆక్రమించుకొని ఆస్పత్రికి వచ్చే రోగులతో గొడవలకు దిగుతుండడంతో వైద్యసేవలకు వచ్చే రోగులు హడలిపోతున్నారు. హాస్పిటల్ సిబ్బంది వీరికి సహకరిస్తుండడంతో వీరి ఆగడాలను అడ్డుకొనేవారే లేకుండా పోతున్నారు. దీనికితోడు బర్రెల దొంగతనాలు అధికమయ్యాయి. పట్టణంలోని ఇందిరా కాలనీలో నివాసం వుంటున్న పొనుగోటి శివరామిరెడ్డికి చెందిన లక్ష రూపాయల విలువ చేసే బర్రెలు దొంగతనానికి గురికావడం దొంగల జోరును తెలియజేస్తోంది. దీనిపై పలువురు రైతులు డిఎస్పీ ఇందిరను కలసి వినతిపత్రం అందజేశారు.

# తీరప్రాంత భద్రత అందరి బాధ్యత!

### ఎస్పీ రామకృష్ణ స్పష్టీకరణ

వేటకు వెళ్లే మత్స్యకారులు తప్పనిసరిగా గుర్తింపు కార్డు కల్గి వుండాలని జిల్లా ఎస్పీ రామకృష్ణ సూచించారు. ఇటీవల పోలీస్ పెరేడ్ గ్రౌండ్‌లోగల ఉమేష్‌చంద్ర సమావేశ మందిరంలో తీరప్రాంత భద్రతపై తీరప్రాంత వాసులు, మత్స్యకారులతో సమావేశం నిర్వహించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ తీరప్రాంత భద్రత కోసం పటిష్టమైన చర్యలు చేపడుతున్నామన్నారు. చొరబాటుదారులు, ఉగ్రవాదులు సముద్ర మార్గం గుండా దేశంలోకి ప్రవేశించే అవకాశం వున్నందున తీర ప్రాంతాల్లో భద్రతకు అధిక ప్రాధాన్యమిస్తున్నట్లు తెలిపారు. గతంలో బొంబాయిలోని తాజ్‌హోటల్‌పై ఉగ్రవాదుల దాడిని ఉదహరించారు. ఇలాంటి ఘటనలు జరగకుండా వుండాలంటే ప్రతి ఒక్కరూ అప్రమత్తంగా వ్యవహరించి అనుమానితుల కదలికలను గుర్తించి పోలీసులకు సమాచారం అందించాలన్నారు. వేటకు వెళ్లే మత్స్యకారులు బోటు లైసెన్సు, గుర్తింపు కార్డు తప్పనిసరిగా తమతో వుంచుకోవాలన్నారు. ఇందుకోసమే మత్స్యకారుల కుటుంబాల నుంచి యువకులను హోంగార్డులుగా తీసుకొన్నామని, వారందరూ ఇప్పటికే తీరప్రాంత భద్రతపై నిమగ్నమయ్యారన్నారు. త్వరలో జరిగే కానిస్టేబుళ్ల ఎంపికలోనూ మత్స్యకారులకు ప్రాధాన్యమిస్తామన్నారు.

● గొలగమూడి ఉత్సవాలకు

# ముంబాయి నుంచి తెప్ప!



గొలగమూడి వెంకయ్యస్వామి ఆరాధనోత్సవాలకు అధికారులు అన్ని ఏర్పాట్లు చేశారు. ప్రతి ఏడాది ఈ ఆరాధనోత్సవాలను వైభవంగా నిర్వహిస్తుంటారు. జిల్లా నలుమూలల నుంచే కాక ప్రక్క రాష్ట్రాల నుంచి భక్తులు అధిక సంఖ్యలో హాజరవుతుంటారు వెంకయ్యస్వామి దర్శనానికి. ఈసారి ఈ ఉత్సవాలలో భాగంగా నిర్వహించే తెప్పోత్సవానికి ముంబాయి నుంచి ప్రత్యేకంగా తెప్పను తీసుకొస్తున్నారు. దీనికి సంబంధించిన వివరాలను ఆలయ కార్యనిర్వహణాధికారి బాలసుబ్రహ్మణ్యం తెలిపారు. ఆధునికంగా రూపొందించిన ఈ తెప్ప 11 లక్షల రూపాయలకుపైగా విలువ చేస్తుందన్నారు.

# పంచ దేవాలయాల్లో వరలక్ష్మీ వ్రతం!



పొటూరు దగ్గరున్న పంచ దేవాలయాల్లో వరలక్ష్మీ వ్రతాన్ని వేడుకగా నిర్వహించారు. తిరుమల తిరుపతి దేవస్థానం వారు జరుపుతున్న మన గుడి కార్యక్రమంలో భాగంగా జరిగిన ఈ వరలక్ష్మీ వ్రతంలో 80 మంది స్త్రీలు పాల్గొని వ్రతం చేపట్టారు. చుట్టుప్రక్కల గ్రామాల నుంచి తరలి వచ్చిన భక్తులతో ఆలయం కిటకిటలాడింది. ఆలయ ఛైర్మన్ వొమ్మిన సుబ్రహ్మణ్యం, ధర్మ ప్రచార మండలి ఉపాధ్యక్షుడు కొండా శేఖర్‌రెడ్డి తదితరులు పాల్గొని వరలక్ష్మీ వ్రతంలో పాల్గొన్న మహిళలకు లక్ష్మీదేవి రూపును, శ్రీవారి లడ్డూ ప్రసాదాన్ని పంచిపెట్టారు.

# కృష్ణం వందే జగద్గురుం!



దశావతారంలో శ్రీకృష్ణావతారం విశిష్టమైనది. ఇది సంపూర్ణ మానవావతారం. కృష్ణావతారానికి ముందు శ్రీరామ, పరశురామ, వామన అవతారాలు మానవ అవతారాలే అయినప్పటికీ ఆ అవతారాలలో లేని పరిపూర్ణత శ్రీకృష్ణావతారంలో కన్పడుతుంది. ఇటు మానవులలో వుండే కపటోపాయాల దగ్గర నుండి అటు దైవం ప్రదర్శించే లీల వరకు శ్రీమహావిష్ణువు ఈ కృష్ణావతారంలో ప్రదర్శించారు. కృష్ణుని జననం నుంచే ఈ లీలా వినోదం ఆరంభమైంది. చెరసాలలో పుట్టిన నాటి నుంచి గోకులానికి చేరడం వరకు చిన్న పిల్లాడిగా, బాలకృష్ణునిగా ఆయన చేసిన లీలలు అందరికి తెలిసిందే. అందుకే శ్రావణ బహుళ అష్టమినాడు రోహిణీ నక్షత్రంలో శ్రీకృష్ణుడు జన్మించినందున శ్రీకృష్ణాష్టమి పండుగగా జరుపుకొంటారు. చిన్నతనంలో గోకులంలో పెరిగినందున గోకులాష్టమి అని, ఆయన జన్మించిన రోజు కాబట్టి జన్మాష్టమి అని పలురకాలుగా పిలుస్తారు.

శ్రీకృష్ణుడు అనగానే ప్రేమ, కర్తవ్యం, గురువు గుర్తొస్తారు. లీలామోహనధారిగా, ఆపద్బాంధవుడుగా, ఇష్ట సఖుడిగా, జన్మించిన నాటి నుంచి ఎన్నో లీలలను ప్రదర్శించడమేకాక నిధిలాంటి భగవద్గీతను యావత్ ప్రపంచానికి అందించి జగద్గురునిగా ప్రసిద్ధి కెక్కాడు. తానేనాడు యుద్ధం చేయకపోయినా, ఆయుధం పట్టకపోయినా నమ్మినవారికి, నమ్ముకొన్నవారికి అండగా నిలచిన స్నేహశీలి, ప్రేమమూర్తి. శ్రీకృష్ణుడు పుట్టుక నుంచి అవతార సమాప్తిదాకా చూపిన లీలలు, చేసిన మహిమలు అనంతం. పాలు తాగే వయస్సులోనే పూతన లాంటి రాక్షసులను, ఆడిపాడే వయస్సులో కంసుడు తదితర దానవులను సంహరించి, గోవర్ధనగిరిని చిటికెన వ్రేలితో ఎత్తి, వివస్త్ర అయిన ద్రౌపది మానం కాపాడి, ధర్మర క్షణకు పాండవులకు అండగా నిలచి, అర్జునుడికి గీతోపదేశం చేసిన పూర్ణావతార మూర్తి శ్రీకృష్ణుడు. మానవులలో ఒకడిగా వుంటూ మానవ జాతికి జీవనగతిని, కర్మఫల సారాన్ని అందజేసి మార్గదర్శకుడయ్యాడు. అలాంటి శ్రీకృష్ణుని లీలలను గుర్తు చేసుకొనే పండుగ శ్రీకృష్ణాష్టమి. ఆనాడు బాలకృష్ణుడి రాకకు గుర్తుగా చిన్న చిన్న అడుగులు గుర్తులు వేసి, గుమ్మానికి మామిడి తోరణాలు కట్టి అందంగా అలంకరిస్తారు. పూజా మందిరంలో శ్రీకృష్ణుని ప్రతిమను వుంచి షోడశోపచారాలతో పూజిస్తారు. శ్రీకృష్ణుడికి ఇష్టమైన వెన్న, నెయ్యి, పాలు, పానకం, అటుకులు నైవేద్యంగా సమర్పిస్తారు. పగలంతా ఉపవాసం వుండి శ్రీకృష్ణుని స్తుతిస్తారు. ఉట్టికొట్టి ఆనందిస్తారు. శ్రీకృష్ణాష్టమి నాడు ఉపవాసం చేయడం వల్ల సప్తజన్మల పాపం తొలగిపోతుందని పురాణాలు చెప్పున్నాయి.



వాడి - వేడి

# జిల్లాలో ఊపందుకొన్న సమైక్యాంధ్ర ఉద్యమం!

**రాజకీయ నేతల సహకారం అంతంత మాత్రంగానే వున్నా జిల్లాలో సమైక్యాంధ్ర ఉద్యమం ఊపందుకొంది. ప్రభుత్వ ఉద్యోగులు, విద్యార్థి సంఘాల ఐక్య కార్యాచరణ సమితి ఉద్యమానికి బాసటగా నిలచి ముందుకు తీసుకవెళ్తున్నాయి.**

జిల్లాలో సమైక్యాంధ్ర ఉద్యమం ఊపందుకొంది. రాష్ట్ర విభజనకు వ్యతిరేకంగా జరుగుతున్న సమైక్యాంధ్ర ఆందోళనలో గజిటెడ్ అధికారులు భాగస్వాములవుతున్నారు. ఇప్పటివరకు ఎన్జీఓలు, ఇతర ప్రభుత్వ శాఖల ఉద్యోగులు మాత్రమే ఆందోళన కార్యక్రమాల్లో పాల్గొనే వారు వీరికి మద్దతుగా డిఆర్వో, జిల్లా అదనపు జాయింట్ కలెక్టర్, డిఆర్‌డిఏ పిడి, జిల్లా ముఖ్య ప్రణాళికాధికారి తదితరులు మద్దతు ప్రకటించి ప్రత్యక్ష ఆందోళనలో పాల్గొంటున్నారు. జిల్లా కేంద్రంలో రోజురోజుకు సమైక్యాంధ్ర ఉద్యమం ఊపందుకొంటోంది. ప్రభుత్వ పాఠశాలల ఉపాధ్యాయులు కూడా 21తేది నుంచి సమ్మెలోకి వచ్చారు. దీంతో పాఠశాలలు పూర్తిగా మూసివేయాల్సి వచ్చింది. ప్రైవేటు పాఠశాలల యాజమాన్యం విద్యార్థుల భవిష్యత్తును దృష్టిలో వుంచుకొని సమ్మె నుంచి వైదొలగుతున్నట్లు ప్రకటించి పాఠశాలలు నిర్వహిస్తున్నాయి.

## ఎమ్మెల్యేల నిరాహార దీక్షలు

రాష్ట్రాన్ని సమైక్యంగా వుంచాలని డిమాండ్ చేస్తూ జిల్లాకు చెందిన ఇరువురు ఎమ్మెల్యేలు నిరాహార దీక్షలు చేపట్టారు. వారిలో ఒకరు తెలుగుదేశం ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ కాగా, మరొకరు వైఎస్సార్ కాంగ్రెస్ పార్టీకి చెందిన ఎమ్మెల్యే నల్లపరెడ్డి ప్రసన్నకుమార్ రెడ్డి. కురుగొండ్ల రామకృష్ణ తన అనుచరులతో కలిసి వెంకటగిరిలో నిరాహార దీక్ష ప్రారంభించగా, ప్రసన్నకుమార్‌రెడ్డి కోవూరు పట్టణంలో ప్రారంభించారు. సీమాంధ్రలో ఇప్పటికే కొన్ని జిల్లాల్లో ఎమ్మెల్యేలు నిరాహార దీక్షలు చేపడుతున్న సంగతి తెలిసిందే. జిల్లాకు చెందిన పది మంది ఎమ్మెల్యేలు, ఇద్దరు పార్లమెంటు సభ్యుల్లో ఒక పార్లమెంటు సభ్యుడు, తొమ్మిది మంది ఎమ్మెల్యేలు రాజీనామాలు చేశారు. మంత్రి ఆనం రామనారాయణరెడ్డి ఒక్కరే రాజీనామా చేయలేదు. ఎమ్మెల్యేల రాజీనామాలన్నీ స్పీకర్ ఆమోదించకపోవడం విశేషం.

విద్యార్థి, ఉద్యోగ సంఘాల నుంచి తీవ్ర వ్యతిరేకత రావడంతో ఎమ్మెల్యేలు రాజీనామా చేస్తున్నట్లు ప్రకటించారు. రాజీనామాలు చేసిన ఎమ్మెల్యేలు నేటికీ ఎమ్మెల్యే హోదాలోనే వివిధ అధికారిక కార్యక్రమాల్లో పాల్గొంటుండడం చర్చనీయాంశంగా మారింది. గత ఇరవై రోజుల నుంచి జరుగుతున్న సమైక్యాంధ్ర ఉద్యమంలో ప్రజాప్రతినిధులు ప్రత్యక్షంగా పాల్గొన్న దాఖలాలు కనిపించడం లేదు. ఉద్యోగ సంఘాలు విధులను బహిష్కరించి సమ్మెలో వుంటున్నందున గజిటెడ్ అధికారులు స్పందించి ఐక్య కార్యాచరణగా ఏర్పడడం జరిగింది. ఇందులో వైద్య ఆరోగ్య శాఖకు చెందిన వైద్యులు వుండడంతో అత్యవసర సేవలకు ఇబ్బంది కలిగే అవకాశం ఏర్పడింది. ఉద్యోగ సంఘాలు సమ్మె చేస్తున్నా ప్రభుత్వం నుండి సరైన నిర్ణయం వెలువడక పోవడంపై ప్రజలు విమర్శిస్తున్నారు.



సమైక్యాంధ్రను ఆకాంక్షిస్తూ కోవూరులో ఆమరణ నిరాహార దీక్ష చేస్తున్న ఎమ్మెల్యే నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి.

## సిపిఎం అనుబంధ సంఘాలు దూరం

సమైక్యాంధ్ర ఆందోళనకు సిపిఎం, దాని అనుబంధ సంఘాలు దూరంగా వుంటున్నాయి. సిఐటియూకు అనుబంధంగా వున్న ఆర్టీసి కార్మిక సంఘం (ఎస్‌డబ్ల్యుఎఫ్)కు చెందిన కార్మికులు విధులకు హాజరవుతున్నారు. మిగిలిన సంఘాల కార్మికులు సమ్మెలో వుండడంతో బస్సులు నడపలేక పోతున్నారు. కొన్ని రూట్లలో మాత్రమే అరకొరగా బస్సులు తిరుగుతున్నా పెళ్లిళ్ల సీజన్ కావడంతో రద్దీగా వుంటున్నాయి. అవసరానికి ప్రైవేటు వాహనాలు, ఆటోలను ఆశ్రయిస్తే అధిక ఛార్జీలు డిమాండ్ చేస్తున్నారు. సమైక్యాంధ్ర ఉద్యమం ఎప్పుడు ముగుస్తుందో అర్థంకాకపోవడంతో ప్రజలు ఇతర ప్రాంతాల ప్రయాణాలను వాయిదా వేసుకోక తప్పడం లేదు.

● ప్రవాసంలో వుండి తెలుగు హృదయాల్ని స్పృశించిన

# బహుముఖ ప్రజ్ఞాశాలి 'మాలతీ చందూర్!'



మన దేశానికి స్వాతంత్ర్యం రాక పూర్వం 1940లలో ఎందరో సాహితీ వేత్తలకు జన్మనిచ్చిన కృష్ణాజిల్లా నూజివీడులో రాజాగారి దివాణంలో ఆటలాడుకుంటూ, అక్కడ దివాణంలో పిల్లలకు ట్యూషన్ చెప్పేందుకు వచ్చే సరోజిని బియ్యే అనే టీచరును చూసి తొలి స్ఫూర్తి పొంది జీవితాంతం 'ఆడవాళ్లు చదువుకోవాలి, వారికి సొంత వ్యక్తిత్వం వుండాలి' అని చాటి చెప్పిన విదుషీమణి, ప్రఖ్యాత రచయిత్రి మాలతీ చందూర్.

పచ్చని మామిడి చెట్ల మధ్య గొప్ప సాహిత్య, సాంస్కృతిక వారసత్వాన్ని పంచే నూజివీడులో ఆమె 1930లో జ్ఞానాంబ, వెంకటేశ్వర్లు పుణ్య దంపతులకు జన్మించారు. ఎనిమిదవ తరగతి వరకు అక్కడి ఎస్ఎస్ఆర్ పాఠశాలలో చదివారు. పువ్వు పుట్టగానే పరిమళిస్తుందన్న చందాన ఆమె బాల్యం నుండి అభ్యుదయ భావాల్ని పంచుతూ పెరిగారు. అనంతరం ఏలూరులోని మామయ్య చందూర్ ఇంట్లో వుండి సెయింట్ థెరిస్సా స్కూల్‌లో ఇంగ్లీషు మాధ్యమంలో చదివారు. అక్కడే శ్రీశ్రీ, విశ్వనాథ, కృష్ణశాస్త్రి, నండూరి సుబ్బారావు, వెంకటాచలం వంటి సాహితీ దిగ్గజాలను చూసే భాగ్యం కలిగింది. 1947లో చందూర్‌ను వివాహమాడి చెన్నైలో జీవితం ప్రారంభించి అక్కడ ఎస్ఎస్ఎల్‌సి పూర్తి చేసారు. 1949లో రచనా వ్యాసాంగానికి శ్రీకారం చుట్టారు మొదట చెన్నై ఆకాశవాణిలో తన రచనలు చదివి విన్పించేవారు. అప్పటి నుండి ఇక అవిశ్రాంతంగా ఆమె ప్రవాసంలో వుంటున్నా నిత్యం తన విభిన్నమైన రచనలతో తెలుగు హృదయాల్ని స్పృశిస్తూనే గడిపిన మహా రచయిత్రి, బహుముఖ ప్రజ్ఞాశాలి మాలతీ చందూర్.

తొలి మహిళా కాలమిస్ట్‌గా 1952లో ఆంధ్రప్రభ వార పత్రికలో "ప్రమదావనం' శీర్షికన కలం ఝుళిపించి రెండు దశాబ్దాలకుపైగా వంటా వార్పూ, పలు ప్రపంచ విశేషాలు, ఇంగ్లీషు నవలలు పరిచయం, విదేశాలు పర్యటించిన వారి అనుభవాలు లాంటి ఎన్నో అంశాల్ని ప్రామాణికంగా చెప్పారు. ఎన్నో గ్రంథాలు చదివి, ప్రపంచ రచయితల్ని తెలుగు వారికి సునాయాసంగా పరిచయం చేసిన ధీశాలి మాలతీ. భర్త, ప్రముఖ పాత్రికేయులు చందూర్‌తో కలసి "జగతి" మాస పత్రిక నిర్వహించడంలోనూ ఈమె పాత్ర అమోఘం. తెలుగు నాట ఉద్భవించిన ప్రతి రచయితను జగతి తనలో భాగస్వామ్యం చేసింది అనడం అతిశయోక్తి కాదు.

తెలుగులో మహిళా అంశాలు విస్తృతంగా ప్రస్తావించాలనే దూరదృష్టితో నవలా రచన చేపట్టి సుమారు పాతిక నవలలు ఆవిష్కరించడమే కాకుండా చెన్నైలోని పలు గ్రంథాలయాలలో ఎన్నో సాహిత్య, విజ్ఞాన గ్రంథాలు చదివి సుమారు 300పై చిలుకు ఆంగ్ల రచనలు నవలలు అనువదించి ప్రపంచ ప్రఖ్యాత రచనలు తెలుగువారు చదివే భాగ్యం కలిగించారు. నవలా మంజరి సీరీస్‌తో ఇప్పటివరకు ఆమె సంక్షిప్త రూపంలో పరిచయం చేసిన ఆంగ్ల నవలలను అయిదు సంపుటాలుగా వెలువరించారు. స్వాతంత్ర్య ఉద్యమ నేపథ్యంలో రాసిన ఈమె నవల "హృదయనేత్రి" బహుళ పాఠకాదరణ పొంది కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు పొందారు. స్త్రీ, పురుష, ప్రకృతులను ఢీ కొన చేసి అందర్నీ ఆలోచింప చేసే అపూర్వమైన నవల 'ఆలోచించు' మధ్య తరగతి కుటుంబ నేపథ్యం వివరించిన 'భూమి పుత్రి'. ఇలా ఎన్నో అంశాలు ఆమె నవలలుగా వచ్చి అలరించాయి. ఈమె రచన "వంటలు – పిండి వంటలు' సుమారు 300 వంటలని, పానీయాలని గురించి రాసింది. ఇప్పటివరకు 30 ముద్రణలు పొంది తెలుగుజాతి గర్వించేలా చేసింది.

స్వాతి వార పత్రికలో చివరి శ్వాస వరకు 'మాలతీ చందూర్ జవాబులు' పేరుతో నడిపిన శీర్షిక పరితల పలు ప్రశ్నలకు సాధికారమైన జవాబులు ఇచ్చి నడిచే విజ్ఞాన సర్వస్వంగా పేరొందారు. పాత కెరటాలు పేర ఎన్నో విశ్వ రచనలు తెలుగు వారికి పరిచయం చేశారు. విషయాన్ని తాను క్షుణ్ణంగా అధ్యయనం చేసి సరళంగా పాఠకులకు అందించే వారు. 1970 దశకంలోనే కేంద్ర సెన్సార్ బోర్డు సభ్యురాలిగా తమిళభాష అభ్యసించి తమిళ చిత్రాలు విశ్లేషించారు.

ఈ మేధావిని పలు పురస్కారాలు అవే వరించాయి. తిరుపతి పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేట్, తెలుగు విశ్వవిద్యాలయం ప్రతిభా పురస్కారం, భారతీయ సాహిత్య పరిషత్ పురస్కారం, కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం, మన నెల్లూరు వారిచే జమీన్‌రైతు

కొరవ 14వ పేజీలో

# వారఫలాలు

*తేది 24-8-2013 నుండి 30-8-2013 వరకు మేషంలో కేతువు; మిథునంలో గురువు; కర్కాటకంలో కుజుడు; సింహంలో రవి, బుధులు; కన్యలో శుక్రుడు; తులలో శని, రాహువులు; మీన, మేష, వృషభాలలో చంద్రుడు సంచరిస్తారు.*



**మేషం**
అశ్వని, భరణి, కృత్తిక 1 పా

వృత్తి, వ్యాపార, వ్యవసాయ తదితర వర్గాల వారికి మిశ్రమ ఫలితాలు మరియు ఆదాయ వ్యయాలు సమానంగా వుంటాయి. నిరుద్యోగులకు బాగుంటుంది. అవివాహితులకు శుభకార్య యత్నాలు ఫలిస్తాయి. రాజకీయులకు పైవారి మైత్రి, వారి సానుకూలత లభిస్తాయి. కళా, క్రీడాకారులకు మిశ్రమ ఫలితాలున్నప్పటికీ ధన లబ్ధి పొందగలరు. ప్రయాణాలలో జాగ్రత్త అవసరం.



**వృషభం**
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

విద్యార్థులకు స్థానమార్పు, దూర ప్రయాణాలుంటాయి. బాడుగింట్లలోని వారికి సమస్యలధికం. వృత్తి, వ్యాపారాలలోని వారికి ధనాదాయం బాగుంటుంది. వృత్తి, ఉద్యోగాలు చేసేవారు కొన్ని దుష్పరిణామాలు ఎదుర్కోవలసి వస్తుంది. తల్లిదండ్రుల ఆరోగ్య సమస్యలు మనస్సును బాధిస్తాయి. కోర్టు విషయాలలో ముందు చూపు అవసరం. నూతన వాహనం లేదా వాహన మార్పులుంటాయి.



**మిథునం**
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు 1,2,3 పా

సంతానం యొక్క భవిష్యత్తు గూర్చి ఆలోచిస్తారు. దూర ప్రయాణాలు వాయిదాపడడం లేక ఆగడం జరుగుతుంది. కొన్ని విషయాలలో కీలక నిర్ణయాలు తీసుకొంటారు. వాహన రిపేర్లు, ఇతర ఖర్చులు పెరుగుతాయి. మీరు చేపట్టే పనులలో విజయం తథ్యం. కళత్రంతో సమస్యలు తీరుతాయి. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారు మిశ్రమ ఆదాయాలను చూస్తారు.



**కర్కాటకం**
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

తలపెట్టిన పనులు ఆలస్యమౌతాయి. రావలసిన బాకీలు సకాలంలో అందవు. వివాహాది శుభకార్యాల నిమిత్తం బంధువుల రాకపోకలధికమౌతాయి. శత్రువుల ఆధిక్యత కొంత తగ్గుతుంది. నూతన మిత్రులతో పరిచయాలేర్పడుతాయి. వృత్తి, వ్యాపార, ఇతర పనులకు నూతనంగా నాంది పలుకుతారు. అనిశ్చితమైన ఆలోచనలు పనికిరావు. ప్రతి విషయంలో ఆలోచించి ఆచితూచి అడుగేయాలి.



**సింహం**
మఖ, పుబ్బ ఉత్తర 1 పా

వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలో సామాన్య స్థితి. తలపెట్టిన పనులలో వ్యతిరేకత వుంటుంది. బంధుమిత్రుల వల్ల కుటుంబంలో సామాన్య పరిస్థితి. అధిక ఖర్చుల వల్ల ధన ఒత్తిడి అధికమౌతుంది. కొన్ని పాత సంఘటనలు పునరావృతమౌతాయి. ఆర్థికాదాయాలపై దృష్టి పెట్టవలసి వుంటుంది. దూర ప్రయాణాలు, పుణ్యక్షేత్ర సందర్శనలు చేస్తారు. కళా, క్రీడాకారులు తమ వృత్తులలో కీలక నిర్ణయాలు తీసుకొంటారు.



**కన్య**
ఉత్తర 2,3,4పా. హస్త, చిత్త 1, 2 పా

నూతన వ్యక్తుల పరిచయాలు, వారితో ఉత్తరప్రత్యుత్తరాలు లాభిస్తాయి. మీ శక్తి సామర్థ్యాలుపయోగించి పేరు సంపాదిస్తారు. పాత మిత్రులు లేదా వ్యక్తులను కలుసుకొంటారు. కొంత రుణభారం తగ్గించుకొంటారు. కుటుంబ స్త్రీలలో భిన్న వాదనలుంటాయి. వృత్తి, వ్యాపారాలు బాగుండి, ఆర్థిక పుష్టి వుంటుంది. కొన్ని పనులు విజయవంతమౌతాయి. వ్యవసాయదారులకు రుణసౌకర్యం లభిస్తుంది.

## పంచాంగం

27తేది శీతలా వ్రతం.
28తేది స్మార్త శ్రీకృష్ణ జన్మాష్టమి.
29తేది శ్రీవైష్ణవ శ్రీకృష్ణ జయంతి.
31తేది పుబ్బ కార్తె.

### శుభ ముహూర్తాలు

24, 25, 26, 27తేదీలలో అన్నప్రాసన, సీమంత, గృహారంభ, గృహ ప్రవేశ, వివాహాలకు శుభ ముహూర్తాలున్నాయి.

### ఆగష్టు తిథులు
### శ్రావణ బహుళ

| | | | | |
|---|---|---|---|---|
| 24 | శని | చవితి | రా | 11.45 గం.ల.వ |
| 25 | ఆది | పంచమి | రా | 11.44 గం.ల.వ |
| 26 | సోమ | షష్టి | రా | 12.33 గం.ల.వ |
| 27 | మంగళ | సప్తమి | రా | 02.04 గం.ల.వ |
| 28 | బుధ | అష్టమి | తె | 04.08 గం.ల.వ |
| 29 | గురు | నవమి | | పూర్తిగా |
| 30 | శుక్ర | నవమి | ఉ | 06.03 గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు - 2. సెల్: 95819 76599.



**తుల**
చిత్త 3,4 పా. స్వాతి, విశాఖ 1,2,3 పా

వృత్తి, వ్యాపార, ఉద్యోగులు తామెంచుకొన్న లక్ష్యాలను సాధిస్తారు. విద్యార్థులకు అనుకూలతలుంటాయి. వ్యవసాయ పనులు వేగవంతమౌతాయి. కళా, క్రీడాకారులు మరియు ఇతర వర్గాల వారికి కార్యసిద్ధి. స్థిరాస్తుల విషయమై ఎటూ నిర్ణయం కాక చిరాకు, చీకాకు కలిగిస్తుంది. ఆర్థిక, కుటుంబ సమస్యలకు పరిష్కారం దొరుకుతుంది. రాజకీయులకు న్యాయ సలహాలు అవసరమౌతాయి.



**వృశ్చికం**
విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ

స్త్రీల మనోవాంఛలు పెరుగుతాయి. ఇంటాబయట ప్రోత్సాహాలు, లబ్ధి, రావలసిన బాకీలు సకాలంలో వస్తాయి. వృత్తి, వ్యాపారాలందు అనుకూలతలు పెరిగి క్రమంగా ఆర్థికాదాయం వుంటుంది. స్థిరాస్తుల విషయంలో వాదనలు తీవ్రమౌతాయి. ఉద్యోగులు పదవి, కీర్తి పొందగలరు. నూతన వ్యక్తుల పరిచయాలు లాభిస్తాయి. శరీరారోగ్య లోపం తరచూ బాధిస్తుంది.



**ధనుస్సు**
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

వివాహాది శుభకార్యాలలో ఆడంబరంగా పాల్గొంటారు. వృత్తి, వ్యాపార, ఉద్యోగుల ఆర్థికాదాయాలు బాగుంటాయి. ప్రయాణాల పట్ల అభిలాష, పుణ్యక్షేత్ర సందర్శనలుంటాయి. వృత్తి, వ్యాపార, ఇతర పెట్టుబడి రంగాలలోని భాగస్వాముల మధ్య లావాదేవీలలో తేడాలు రావచ్చు. కళా, క్రీడాకారులకు తోటి వారితో పోటీతత్వం ఏర్పడుతుంది. వ్యవసాయదారులు ధన లాభాలు ఆర్జిస్తారు.



**మకరం**
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

తలపెట్టిన పనులన్నీ సకాలంలో పూర్తవుతాయి. నూతన కార్యాల పట్ల ఆసక్తి చూపుతారు. వృత్తి, వ్యాపారాలలో అధిక శ్రమ వున్నా లాభాలు పొందుతారు. కళా, క్రీడాకారులకు తగిన అవకాశాలు లభిస్తాయి. వ్యవసాయ పనులు ప్రారంభ దశలో వుంటాయి. తండ్రి నుంచి ధన సహాయం లభించగలదు. ఉద్యోగులకు పని భారం పెరుగుతుంది. ఊహించని రీతిలో ధనాదాయం వుంటుంది.



**కుంభం**
ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

తలపెట్టిన పనులు నిదానంగా సాగుతాయి. ఆర్థిక ఇబ్బందులు పెరిగి రుణాలు చేయవలసి వుంటుంది. వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలలో ఆర్థికస్థితి గతం వలె వుంటుంది. దూర ప్రయాణాలు చేస్తారు. స్థానచలనాలు, నూతన పరిచయాలుంటాయి. పాత మిత్రుల కలయికచే అధిక ధనం ఖర్చు చేస్తారు. భాగస్వాములతో విభేదాలుంటాయి. వ్యవసాయ పనులు వేగవంతమౌతాయి.



**మీనం**
పూర్వాభాద్ర 4 పా. ఉత్తరాభాద్ర, రేవతి

తలపెట్టిన పనులలో కొన్ని జాగ్రత్తలవసరం. వ్యవహారాలలో విజయం. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలో ఆర్థికాదాయాలుంటాయి. బలం పుంజుకుంటారు. ఆర్థిక ఇబ్బందులు, రుణ ఒత్తిడులు వెన్నంటే వుంటాయి. కుటుంబ వ్యవహారాలకు, వాహన రిపేర్లకు కొన్ని రుణాలు చేస్తారు. కొన్ని కుటుంబ సమస్యలు బాధిస్తాయి. కళా, క్రీడాకారులకు సామాన్య అనుకూలతలు.

# సంఖ్యా శాస్త్రాన్ని శాస్త్రజ్ఞులు ఆమోదించలేదు!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*డి.సుజాతారెడ్డి — విజయవాడ*

* *సంఖ్యాశాస్త్రాన్ని గురించి మీ అభిప్రాయం చెప్పండి?*

జ్యోతిషంలో హస్త, అంగ, సాముద్రికాలు ప్రామాణికమైవి. సంఖ్యాశాస్త్రం శాస్త్రజ్ఞుల ఆమోదాన్ని పొందలేదని పెద్దలంటున్నారు.

*డాక్టర్ సుభాష్‌చంద్ర — బెంగుళూరు*

* *'వాస్తు సూక్త నిదానం' అని పెద్దలు చెబుతుంటారు. దాని అర్థం, భావం తెలియజేస్తారా?*

అగస్త్య వాస్తు నిర్వచనం ప్రకారం హర్షకోణ విధి, బ్రహ్మ నాభి, ప్రధమార్ధ, అంత్యార్ధ, ఆదిగా గల వాస్తు ముఖ్యాంశాలను 'సూక్తి నిదానం' అంటారు. ఇవి వున్న గృహంలో ఆరోగ్య, ఆర్థికస్థితులు ఉన్నతంగా వుంటాయని మహర్షి నిర్వచించారు.

*టి.ప్రసాద్ — విద్యానగర్*

* *మూల, జ్యేష్ఠ వంటి స్త్రీలతో వివాహం కూడదా?*

ఇది సమాజంలో పాతుకుపోయిన దురభిప్రాయం. ప్రతి నక్షత్రానికి మంచి చెడులున్నట్లే వీటికీ సాధక బాధకాలున్నాయి. మూల, జ్యేష్ఠ, విశాఖ 1, 2, 3 పాదాల వారిని చేసుకోవడం వల్ల ఎటువంటి అరిష్టాలు కలుగవు.

*డి.ఆంజనేయులు — వెంకటగిరి*

* *అక్షరాలు మారిస్తే మనిషి జాతకం మారుతుందంటారు నిజమేనా?*

అదెట్లా సాధ్యమవుతుంది? దీర్ఘాలు, వత్తులూ అక్షరాలు మారిస్తే జీవితాలు మారితే మనుషుల్లో కొందరు అభాగ్య జీవితాల్ని ఎందుకు గడుపుతున్నట్లు.

*శారదా నాయుడు — చిత్తూరు*

* *వీధి పోట్లున్నప్పుడు వినాయకుడి విగ్రహాన్ని ప్రతిష్టిస్తే సరిపోతుందా?*

వినాయకుడు దిష్టిబొమ్మ కాదు కదా అట్లా చేయడానికి. ఎదురు గూడుకట్టి నిర్దుష్టమైన యంత్ర ప్రతిష్ట చేయాలి. ధూపదీప నైవేద్యాలు రోజూ ఏర్పాటు చేయాలి.

*డి.విశ్వనాథ్ — చెన్నై*

* *ఇంట్లో వృక్షాన్ని కొట్టివేశాక, చాలా దుర్భరమైన పరిస్థితుల్ని అనుభవించాను.*

తెలియక చేశారు కాబట్టి విచారించకండి. దోషనివారణపై మీకు నిజంగా ఆసక్తి వుంటే కన్యా రాశి వారైన మీకు దేవతా వృక్షం ఆమ్ర(మామిడి) గనుక 18 మొక్కల్ని మీ స్కూల్‌లో నాటి వాటిని పోషించండి. మీ దోషం తొలగి పోతుంది.

*పి.యశోదారెడ్డి — కావలి*

* *వాస్తు అంతా బాగానే వుంది. అయినా పరిస్థితులేమీ బాగోలేవు.*

ఈశాన్యం దేవుడి గది వంటి ప్రాథమిక వాస్తు సంగతి సరే. మరి మీ యింటి ప్లానులో బ్రహ్మ నాభి, కమల స్థానాలు సరైనస్థితిలో లేవు. అందువల్ల మిడి మిడి జ్ఞానం వున్న వాళ్లకికాక శాస్త్ర నిపుణులైన వాస్తు శాస్త్రజ్ఞులకు మీ గృహాన్నొకసారి చూపించండి.

*జె.రవిప్రకాష్ — కావలి*

* *శాస్త్రాల్ని కొందరు తమకు అనుకూలంగా మార్చి రాసుకున్నారని నేనంటాను?*

మంచి, చెడులు అన్నికాలాల్లోనూ వున్నాయి. శాస్త్రాల్లో కొందరు వ్యక్తులు చేర్పులు, మార్పులు చేసిన మాట వాస్తవం. వీటినే ప్రక్షిప్తాలన్నారు. అందువల్లే ఛాందసాల పాటింపు కూడా ఎక్కువయింది.

*సయ్యద్ రుస్తుం — చెన్నై*

* *నాకు మానసిక వత్తిడులు, భయభ్రాంతులు ఎక్కువ. నేనేమి చేయాలి?*

మీది ఆశ్రేష నక్షత్రం. పుట్టిన తేదీ వివరాలు చూశాను. నక్షత్రాధిపతి సర్పం. కనుక మూడు, ఏడు, పదకొండు రోజులపాటు నాగప్రదక్షిణలు చేసి, నైవేద్యంగా పెట్టిన పాలను స్వీకరించండి. దోష హరణమవుతుంది.

*వై.రేణూరెడ్డి — నెల్లూరు*

* *దుష్ట నక్షత్రాలు, దోషాలు, వాటి నివారణ తప్పనిసరి అంటున్నారు. నిజమేనా?*

ఈ వివరణలో తప్పేమీలేదు. మీరు ఒత్తిడికి లోనుకావాల్సిన పనీలేదు. దోషాలకు పరిహారాలున్నాయి. పరిష్కారాలున్నాయి. అవి చేసుకుంటే సరిపోతుంది.

*టి.కృష్ణ — తెనాలి*

* *చాలా కళాశాలల్లో చాలా సమస్యలుంటాయి. ఎందువల్ల?*

నిర్మాణాలలో వీధి, స్థల, నిర్మాణ కోణాల్ని పాటించక పోవడం వల్ల నిర్మాణాలు ఒక క్రమ పద్ధతిలో నిర్మించక పోవడం వల్ల అవి నిత్యం సమస్యలతో ఉక్కిరి బిక్కిరవుతుంటాయి.

# సండే మార్కెట్‌లో కిషోర్‌బాబు జులుం!



నెల్లూరులోని సండే మార్కెట్.

**సండే మార్కెట్‌లో ఎన్నో ఏళ్లుగా వ్యాపారం చేసుకొంటున్న గిరిజన వృద్ధ దంపతుల షాపును కిషోర్‌బాబు తన మనుషుల చేత దౌర్జన్యంగా ఖాళీ చేయించి మరొకరి చేత షాపు పెట్టించడం వివాదాస్పదమయ్యింది. ఈ వ్యవహారమై పోలీసులకు ఫిర్యాదు చేసినా పట్టించుకోకపోవడం విమర్శకు దారితీస్తుంది.**

నెల్లూరు నగరంలోని సండే మార్కెట్‌లో ఆధిపత్యపోరు మళ్లీ ప్రారంభమైంది. సండే మార్కెట్‌లో దుకాణాలను ఏర్పాటు చేసుకున్న వారంతా "రోడ్డు మార్జిన్ వ్యాపార సంక్షేమ సంఘం"గా రిజిష్టర్ కూడా చేసుకున్నారు. సండే మార్కెట్‌లో ఎవరైనా షాపును విక్రయించాలన్నా, కొనుగోలు చేయాలన్నా, యూనియన్ నేతల నుండి అనుమతి పొందాలన్న నిబంధన పెట్టారు. తొలుత ఇక్కడ తమిళనాడు రాష్ట్రానికి చెందిన వారు ఎక్కువ మంది వుండేవారు. రాను రాను నెల్లూరు నగరానికి చెందిన వారు సండే మార్కెట్‌లో షాపులను కొనుగోలుచేసి వ్యాపారాలు చేసుకొంటున్నారు. వ్యాపారుల మధ్య పోటీ ఏర్పడడం, ప్రతి చిన్న విషయంలో యూనియన్ నేతల జోక్యం వుండడంతో విబేధాలు ఏర్పడ్డాయి. ఈ క్రమంలో పోలీసుస్టేషన్‌లో ఫిర్యాదులు కూడా చేసుకున్న సందర్భాలున్నాయి.

సండే మార్కెట్‌లో షాపులకు మంచి డిమాండ్ వుండడంతో యూనియన్ నేతలు చెప్పిందే వేదంగా జరుగుతోంది. షాపును ఏర్పాటు చేసుకున్న వ్యక్తి ఆర్థికంగా దెబ్బతిన్న సమయంలో షాపును విక్రయించుకునే అవకాశం లేదు. యూనియన్ నేతలు చెప్పిన వారికే, వారు నిర్ణయించిన ధరకే విక్రయించాలి. యూనియన్ నేతలు ఎంఎల్ పార్టీ పేర్లతో వ్యాపారుల వద్ద చందాలు వసూళ్లు చేస్తుంటారన్న ఆరోపణలు వున్నాయి. చందాలు ఇవ్వని వారిపై కక్ష సాధింపు చర్యలకు దిగుతుంటారని ఇక్కడ వ్యాపారులు వాపోతున్నారు. ఇటీవల సండే మార్కెట్‌లో ఓ వృద్ధ దంపతులకు సంబంధించిన షాపును యూనియన్ నేతలు బలవంతంగా వేరే వ్యక్తికి విక్రయించేందుకు సహకరించారు. తొలుత ఈ దంపతులు తమ షాపును ఒక న్యాయవాదికి విక్రయించేందుకు అంగీకరించారు.

సండే మార్కెట్‌లో షాపును ఏర్పాటుచేసుకొన్న తిరుమలశెట్టి శేషమ్మ, ఆమె భర్త వృద్ధ దంపతులు. వీరు గిరిజన కులానికి చెందినవారు. వీరిని షాపు ఖాళీ చేయాలని చాలా నెలల నుంచి కిషోర్‌బాబు వివిధ రకాలుగా బెదిరించాడని బాధితులు వాపోయారు. ఇటీవల కిషోర్‌బాబు అనుచరులు శరవణన్, వడివేలు, సెంథిల్, చిన్నరాజు, మురుగేషన్, రామ్మూర్తి, పి.రమేష్ అనే వ్యక్తులు ఆ దంపతుల ఇంటికి వెళ్లి వారిచేత ఖాళీ పత్రాలపై వేలి ముద్రలు వేయించుకున్నారని ఒకటవ నగర పోలీస్ స్టేషన్‌లో ఫిర్యాదు కూడా చేసి వున్నారు. అప్పటికి షాపును న్యాయవాదికి విక్రయించామని దంపతులు విన్నవించినా వారి మాటలు ఖాతరు చేయలేదు. రాత్రికిరాత్రే కొనుగోలు చేసిన షాపు స్థలంలో మరొక బంకును ఏర్పాటుచేసి వ్యాపారం సాగిస్తున్నారు. జరిగిన విషయాన్ని న్యాయవాదికి దంపతులు వివరించడంతో ఆయన వెనక్కు తగ్గినట్లు సమాచారం. దంపతులు మాత్రం ప్రజా సంఘాల నేతలను ఆశ్రయించి సండే మార్కెట్‌లో యూనియన్ నేత కిషోర్‌బాబు చేస్తున్న జులుం గురించి చెప్పారట. ఐదు ప్రజా సంఘాలకు చెందిన నేతలు నిజనిర్ధారణ కమిటీగా ఏర్పడి సండే మార్కెట్‌లో జరుగుతున్న వివాదాలపై విచారణ కూడా చేశారు. ఈ విచారణలో కిషోర్‌బాబు చేస్తున్న అరాచకాల గురించి అక్కడ వ్యాపారులు వివరించడం జరిగింది. అయితే పోలీసు స్టేషన్‌లో ఫిర్యాదు చేసినప్పటికీ ఇప్పటివరకు సదరు నేతపై ఎటువంటి చర్యలు తీసుకోలేదు.

సండే మార్కెట్‌ను అడ్డాగా చేసుకుని ఎన్నో సంవత్సరాల నుండి వ్యాపారులపై దౌర్జన్యం చేస్తున్నా ఎవరూ పట్టించుకోలేదు. ప్రస్తుతం సండే మార్కెట్ రెండు వర్గాలుగా విడిపోయింది. ఒక వర్గం మాత్రమే జులుం చేసే నేతకు అండగా వుండగా, మరోవర్గం దూరంగా వుంది. ప్రతినెల వ్యాపారుల నుండి భారీ ఎత్తున చందాలు వసూలుచేసి విలాసవంతమైన జీవనం సాగిస్తున్నారని కొందరు వ్యాపారులు చెప్పారు.

ప్రజా సంఘాల్లో కీలక నేతగా వ్యవహరిస్తూ మరొక ప్రక్క సండే మార్కెట్‌పై ఆధిపత్యం చెలాయిస్తుండడంతో ఇతన్ని ఎదిరించేందుకు ఎవరూ సాహసించడం లేదు. ఒక విప్లవ సంస్థకు అనుబంధంగా వుండే రైతు కూలీ సంఘంలో వుంటూ చిన్నా చితకా వ్యాపారులపై దౌర్జన్యం చేయడం ఎంతవరకు సమంజసమో ఆ సంఘం నేతలకే తెలియాలి.

**చకోర పక్షులు**

# చెక్ పవర్ కోసం ఎదురుచూస్తున్న సర్పంచ్‌లు!

నూతనంగా ఎన్నికైన సర్పంచ్‌లు ఆర్థికాధికారం కోసం ఎదురు చూస్తున్నారు. సర్పంచ్‌ల పదవీ కాలం ముగిసిన రెండు సంవత్సరాల తర్వాత రాష్ట్ర ప్రభుత్వం గ్రామ పంచాయతీ ఎన్నికలు నిర్వహించింది. ఈ ఎన్నికల్లో గెలుపొందిన వారు పంచాయతీ అభివృద్ధి కోసం కృషి చేస్తామని ఎన్నికల ప్రచారంలో ఓటర్లకు హామీ ఇచ్చి వున్నారు. సర్పంచ్‌లుగా అధికారం చేపట్టిన వారికి చెక్ పవర్ అప్పగించడంలో అధికారులు నిర్లక్ష్యం వహించారు. అధికారం చేపట్టినా చెక్ పవర్ లేకపోవడంతో తీవ్ర నిరాశ చెందుతున్నారు. బ్యాంకుల్లో వున్న పంచాయతీ నిధుల్ని ప్రజల అవసరాల కోసం ఖర్చు చేసేందుకు ఇబ్బందులు తప్పడం లేదు. నిధులకు సంబంధించి పూర్తి సమాచారం సర్పంచ్‌లకు అందడం లేదు. పంచాయతీ కార్యదర్శుల పరిపాలనలో రెండు సంవత్సరాలు గ్రామాలు అభివృద్ధికి నోచుకోలేక పోయాయి. పంచాయతీ పాలకవర్గం ఏర్పడిన తర్వాత అభివృద్ధికి కృషిచేస్తారని ప్రజలు భావిస్తున్నారు.

## పంచాయతీలపై సమ్మె ప్రభావం

రాష్ట్ర విభజనకు వ్యతిరేకంగా జరుగుతున్న ఆందోళనలు, ఉద్యోగుల సకల జనుల సమ్మె ప్రభావం గ్రామ పంచాయతీలపై పడింది. పంచాయతీ సర్పంచ్‌లు ప్రతి పనికి మండల పరిషత్, తహశీల్దార్ కార్యాలయాలకు వెళ్లి సమస్యల పరిష్కారం కోసం అధికారులను కలుసుకుని చర్చించాల్సి వుంటుంది. ప్రభుత్వ ఉద్యోగులందరూ సమ్మెలో వుండడంతో కార్యాలయాలు వెలవెలబోతూ కనిపిస్తున్నాయి. గ్రామస్థాయి నుండి జిల్లాస్థాయి వరకు పరిపాలన పూర్తిగా స్తంభించి పోయింది. వివిధ పనుల నిమిత్తం కార్యాలయాలకు వెళ్లినవారు సైతం సిబ్బంది సమ్మెలో వున్నారన్న విషయం తెలుసుకుని ఇంటి దారి పడుతున్నారు. వెనుతిరిగే వారిలో సర్పంచ్‌లు కూడా వుండడం విశేషం.

వివిధ రాజకీయ పార్టీల మద్దతుతో రిజర్వుడు స్థానాల్లో గెలుపొందిన వారు అధికారం చెలాయించలేక పోతున్నారు. ఎవరి మద్దతుతో ఎన్నికల్లో గెలుపొందారో, వారి అనుమతి లేకుండా ఎటువంటి నిర్ణయం తీసుకోలేని పరిస్థితి ఏర్పడింది. ఈ నేపథ్యంలో పంచాయతీల అభివృద్ధి ఏ మేరకు జరుగుతుందో కూడా ఊహించుకోవచ్చు. ప్రధానంగా ఎస్సీ, ఎస్టీల పంచాయతీల్లో ఎన్నికైనవారు గ్రామ పెత్తందార్ల ఇంటి చుట్టూ తిరుగుతున్నారు. పంచాయతీలకు రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు విడుదల చేసే నిధులను ఏ పనికి ఖర్చు చేయాలన్నా సొంతంగా నిర్ణయం తీసుకునే అవకాశం వుండదు. కాబట్టివారు కేవలం శిలావిగ్రహాలుగా వుండాల్సి వుంటుందని కొందరు వ్యాఖ్యానిస్తున్నారు. వర్షాకాలం సమీపించడంతో పంచాయతీ పరిధిలో త్రాగునీరు సమస్య, వీధిలైట్లు, పారిశుద్ధ్యం మెరుగుకోసం చర్యలు తీసుకోవాల్సి వుంటుంది. ఇందుకు నిధులు కూడా భారీగానే అవసరం అవుతాయి. ప్రస్తుతం బ్యాంకు నుండి నిధులు డ్రాచేసే అధికారం ఇవ్వక పోవడంతో ఒక్క పని కూడా చేయలేక పోతున్నామని సర్పంచ్‌లు ఆవేదన చెందుతున్నారు.

మేజర్ పంచాయతీలు మినహా మిగిలిన వాటిలో నిధుల కొరత తీవ్రంగా వుంది. ప్రత్యేకాధికారుల పాలనలో పన్నులు,సెస్సులు, స్టాంపు డ్యూటీ సక్రమంగా వసూలు చేయలేక పోయారు. పన్నులు వసూలు కాకపోవడంతో పారిశుద్ధ్య సిబ్బందికి ప్రతి నెల జీతాలు చెల్లించడం కష్టతరంగా మారింది. నిధుల కొరత ఏర్పడడం, చెక్ పవర్ లేకపోవడం, కార్యదర్శులు సహకరించక పోవడం వంటి సమస్యలతోపాటు రాజకీయ పార్టీ నేతలు పెత్తనం చెలాయిస్తుండడంతో పంచాయతీ పాలన సాగించడం సవాల్‌గా మారింది. జిల్లా అధికార యంత్రాంగం స్పందించి కొత్తగా ఎన్నికైన వారికి సర్పంచ్‌ల అధికారాలు, పంచాయతీ పరిపాలనపై అవసరమైన శిక్షణ ఇప్పించాల్సిన అవసరం వుంది.

**పంచాయతీ ఎన్నికల్లో పోటీచేసి గెలిచిన సర్పంచ్‌లకు చెక్ పవర్ ఇవ్వడంలో అధికారులు నిర్లక్ష్యం వహించడంతో గ్రామాల్లో చిన్న పని కూడా చేయించలేక పోతున్నారు. ఆరంభంలోనే ఉత్తభద్రయ్యలుగా మిగిలామే అని లోలోన మధన పడుతున్నారు.**

# ఆకట్టుకొనే జగద్గురు ఆదిశంకర!



అల్లూరు రహీం

క్రీస్తు శకం 820లో జన్మించిన ఆది శంకరాచార్యులు హిందు మతాన్ని పునరుజ్జీవింపజేసిన అఖిల భారత ద్విజునిగా ఖ్యాతి గడించారు. పరమ శివుడే ఆది శంకరాచార్యుని రూపంలో అవతరించాడంటారు. శంకరాచార్యుల వారి జీవితాన్ని గమనిస్తే ఆయన మనిషి అని నమ్మలేని పరిస్థితి. కేరళ రాష్ట్రంలోని కాలడి అనే గ్రామంలో పుట్టిన ఆయన పాదచారిగా భారతదేశమంతా నాలుగుసార్లు చుట్టేశారు. ప్రతి ఊరిలో పండితులు, మేధావులు, హిందూ, బౌద్ధ, జైనమతాలకు చెందిన ఆచార్యులను తన వాదనా పఠిమతో ఓడించిన ఘనాపాఠి. తాను ప్రతిపాదించిన అద్వైత సిద్ధాంతం గొప్పదని కాశ్మీర సర్వజ్ఞాన పీఠంలో సరస్వతిదేవి మెచ్చుతుంది. కాని ఆయన జీవించింది 32 ఏళ్లు మాత్రమే. అటువంటి అద్భుత అద్వైత జ్ఞాని జీవితాధారంగా గ్లోబల్ పీస్ క్రియేషన్స్ బ్యానర్‌పై జగద్గురు ఆది శంకర చిత్రాన్ని తీశారు. ఈ చిత్రానికి అన్నమయ్య, శ్రీరామదాసు, శ్రీమంజునాథ వంటి భక్తి, ముక్తిదాయక చిత్రాలకు కథ, మాటలు సమకూర్చిన జె.కె.భారవి దర్శకత్వం వహించారు. కేవలం రెండున్నర గంటల వ్యవధిలో శంకరాచార్యుల వారి జీవితంలోని ముఖ్య ఘట్టాలను గుదిగుచ్చి కనుల ముందు ఆవిష్కరించిన తీరు అద్భుతం. దీనికోసం కంప్యూటర్ టెక్నాలజీ వాడారు. తొమ్మిదికోట్ల రూపాయలు ఖర్చు పెట్టారు. ఈ శ్రమ ఫలించిందనాలి. మెగాస్టార్ చిరంజీవి వాఖ్యానంతో ప్రారంభమయ్యే ఈ చిత్రంలో ఆదిశంకరునికి శ్రీచక్రోపన్యాసం, కనకధారా స్తోత్ర పఠనం, పరకాయ ప్రవేశం, కనికట్టు ప్రదర్శన, చాంగుభళా పాటలో ప్రకృతి అందాలను సిజె టెక్నాలజీలో చూపించిన తీరు అద్భుతంగా వుంది. ఈ చిత్రంలో పాటలు కూడా బ్రహ్మాండమే. ఎవడు నేను, శ్రీకృష్ణుడు, శంభోశంకర, మాయ, కామదేవ, మోక్షమియ్యరా పల్లవులతో మొదలయ్యే పాటలకు నాగ్ శ్రీవత్స మంచి సంగీతాన్ని అందించారు. మనసు మెచ్చే మాటలను వ్రాయడంలో జెకె.భారవి కలం చేసిన విన్యాసం అష్టావధానాన్ని గుర్తు చేస్తుంది. ప్రకృతి మారలేదు. మనిషి మారాడు. డబ్బు పుట్టింది... మానవత్వం చచ్చింది. జీర్ణించుకోగలిగితే అద్వైతం, జంతువులను, జవరాళ్లను హస్తాలతో లొంగ దీసుకొంటాను వంటివి ఆలోచింపజేస్తాయి. మండల మిశ్రునితో ఆదిశంకరుని వాదన అద్భుతం. మీరే పిండం, బాలుడు, భర్త, తాత, శవాలుగా ఐదు రూపాలు ఎత్తగా లేనిది ఆ దేవ దేవునికి ఎన్ని రూపాలు వుండాలన్న మాట సినిమా చూస్తున్న వారందరినీ ఆలోచింపజేస్తుంది.




ఆది శంకరుని జీవిత కథ గూర్చి ప్రత్యేకంగా వ్రాయనక్కరలేదు. కాని ఆ పాత్రలో ఒదిగిన నటుడు కౌశిక్ బాబును అభినందించకుండా వుండలేము. పలు పార్శ్వాలలో ఆయన అద్భుతంగా నటించాడు. కాశీ కాటి కాపరిగా నాగార్జున, కాపాలికునిగా సుమన్, మండల మిశ్రునిగా సాయి కుమార్, ఉభయభారతిగా కమలినీ ముఖర్జీ, రాజుగా ఇండియన్ ఐడెల్ శ్రీరామచంద్ర, జగద్గురుకు గురువులుగా నాగబాబు, శ్రీహరి, మోహన్‌బాబు, తనికెళ్ల భరణి తమ పాత్రల్లో జీవించారు. ఇంత మంది పెద్ద నటుల చేత బ్రహ్మాండంగా నటన రాబట్టడం జె.కె.భారవి గొప్పతనమనక తప్పదు. ఇటువంటి సినిమాలు రావడం ఎంతో అవసరం. కాబట్టి ప్రేక్షకులు జగద్గురు ఆదిశంకర లాంటి చిత్రానికి తప్పకుండా వెళ్లాలి.

## పెదాలకు సర్జరీ



అందాలకు పదును పెట్టడంలో హీరోయిన్లు ముందుంటారు. చిన్న చిన్న లోపాలేమైనా కనిపిస్తే కాస్మొటిక్ సర్జరీ పేరుతో సరిచేసుకొంటుంటారు. శ్రీదేవి ముక్కును సరి చేయించుకొంది. శిల్పాశెట్టి, ప్రియాంకచోప్రా తదితర భామలంతా చిన్న చిన్న సర్జరీలతో తమ అందాలకు మరింత పదును పెట్టుకొన్నారు. ఇప్పుడు కొత్తగా బాలీవుడ్ సుందరి అనుష్క శర్మ తన అందాలను అందంగా తయారు చేసుకొందని సమాచారం. పెదాలు కాస్త మొద్దుబారినట్లుగా లావుగా వున్నాయని చెప్పి సర్జరీ చేయించుకొందట. ఇదే విషయమై అనుష్కను అడిగితే ప్రపంచంలో మీకేమీ సమస్యల్లేవా? మా దేహంలో ఏం లోపాలు ఉన్నాయో తెలుసుకోవడమేనా అంటూ కోప్పడింది.

## పెళ్లికి సిద్ధం!



ప్రతివారు పెళ్లెప్పుడు అంటూ అడుగుతున్నారు. అందుకు నేను కూడా సిద్ధంగానే ఉన్నానంటోంది హీరోయిన్ దియామీర్జా. ఈమెది హైదరాబాద్. అందాల పోటీలో 'మిస్ ఆసియా ఫసిపిక్'గా కిరీటం అందుకొంది. వాణిజ్య ప్రకటనల్లో మోడల్‌గా మెరిసింది. బాలీవుడ్‌లో హీరోయిన్‌గా తనకంటూ ఒక గుర్తింపు కోసం ఇంకా ప్రయత్నిస్తూనే వుంది. సినిమా షూటింగ్ లేకపోతే సామాజిక సేవచేస్తానంటోంది దియా. సమాజంలో అసమానతలు తగ్గించడానికి తన వంతు కృషిచేస్తానంటోంది దియా. దియాకు పెళ్లిపై కూడా మనసు పోయినట్లుంది. పెళ్లెప్పుడు? అంటే ఓ మంచి అబ్బాయిని చూసి పెట్టండి నేను చేసుకోవడానికి రెడీనే అంటోంది. ఆస్తులు లేకపోయినా పర్వాలేదు. కానీ గుణం, మచ్చలేని మనసు, నిజాయితీగల మగాడు కావాలి. అలాంటి వాడు ఎదురైతే పెళ్లి పీటల మీద కూర్చోడానికి తనకు ఎలాంటి అభ్యంతరం లేదంది.

## డింపుల్ సంతోషం



రొమాన్స్ చిత్రంతో తెలుగు ప్రేక్షకుల్లో బాగా గుర్తింపు వచ్చినందుకు హీరోయిన్ డింపుల్ చోపడే సంతోషాన్ని వ్యక్తం చేసింది. చిత్ర పరిశ్రమలో తన ప్రవేశం గూర్చి వివరిస్తూ 'కొటే' అనే సినిమాతో కన్నడ పరిశ్రమలో ప్రవేశించాను. యారురా మహేష్ సినిమాతో తమిళ ప్రేక్షకుల అభిమానం పొందాను. నాటకాలు, స్టేజిషోలు చేస్తూ హీరోయిన్ అయ్యాను. కొన్ని లఘు చిత్రాల్లోనూ నటించాను. నాలోని నటనకు నాకు నేనే చిన్న పరీక్షలు పెట్టుకున్నా. నా మీద నాకు నమ్మకం కుదిరిన తర్వాత సినిమాల్లోకి అడుగు పెట్టాను. గ్లామర్ పాత్రలకే పరిమితం కావాలనుకోవడం లేదు. అన్నిరకాల పాత్రలు చేయాలని ఉంది. ఇప్పటివరకు నేను చేసిన పాత్రల్లో గ్లామర్‌కు ఎంత ప్రాధాన్యం ఉందో నటనకూ అంతే అవకాశం వుంది. రాబోయే సినిమాల్లోని పాత్రలు కూడా ఇదే తరహాలో ఉండాలని కోరుకొంటున్నానంది.

## సలహాలు తీసుకోను!

ఏ విషయంలోనైనా ఒకటి రెండు సార్లు ఆలోచించి నిర్ణయం తీసుకోవడం నాకు అలవాటు. నాకు సుబంధించిన వ్యవహారాల్లో మరొకరు జోక్యం చేసుకొనే అవకాశం మాత్రం ఇవ్వనంటోంది ముద్దుగుమ్మ రిచా గంగోపాధ్యాయ. ఈ ముద్దుగుమ్మ ప్రస్తుతం నాగార్జునతో భాయ్ చిత్రంలో నటిస్తోంది. కథలను ఎంపిక చేసుకోవడంలో ఎవరి సలహానైనా తీసుకొంటారా? అని అడిగితే స్వంతత్ర్య భావాలు కల్గిన అమ్మాయిని నేను. నాకు సంబంధించినంత వరకు నేనే నిర్ణయాలు తీసుకొంటాను. దాని తాలుకు ఫలితం ఎలాంటిదైనా ఆనందంగా స్వీకరిస్తానంది. చేతిలో ఒక్క సినిమానే ఉందంటే... రోజూ పది కథలు వింటుంటాం. అవన్నీ చేయలేం కదా. ఒక్కటి అయినా మంచి కథలో భాగమైతే చాలు అని చెబుతుంది.

## మాధురీదీక్షిత్‌లో మార్పు!



సీనియర్ నటీనటులకు సెట్‌లో వన్స్‌మోర్ అని చెప్పించుకోవడం ఏమాత్రం ఇష్టం ఉండదు. ఎంత సుదీర్ఘమైన సన్నివేశమైనా ఒక్క సారే. అన్ని రకాల కసరత్తులతో కెమెరా ముందుకు వస్తారు. మాధురీ దీక్షిత్ కూడా సింగిల్ టేక్ నటిగా ముద్ర తెచ్చుకొంది. కానీ ఇష్కియా సినిమాలో ఒక సన్నివేశం కోసం మాత్రం ఆమె ఏకంగా 25 టేకులు తీసుకొంది. ఈ సంఘటన మాధురీకి విసుగు తెప్పించింది. నా కెరీర్‌లో ఎప్పుడూ ఇలా జరగలేదు. ఉర్దూ పదాలతో కూడిన సంభాషణ పలకాల్సి వచ్చింది. కష్టమైన పదాలున్నాయి. అందుకే మళ్లీ మళ్లీ చేయాల్సి వచ్చిందని వివరణ ఇచ్చింది.

✦ సమైక్యాంధ్రకు

# గెజిటెడ్ అధికారుల సై!

## వీధుల్లోకి వచ్చిన జిల్లా అధికారులు

గ్రామస్థాయి నుంచి మండలస్థాయి వరకు అధికారులు 16వ తేది వరకు సమైక్యాంధ్ర ఉద్యమంలో పాలు పంచుకొంటుండినారు. 17వ తేది నుంచి సమైక్య నిరసనలో గెజిటెడ్ అధికారులు సైతం పాల్గొన్నారు. అదనపు సంయుక్త కలెక్టర్ చల్లా పెంచలరెడ్డి, డిఆర్వో రామిరెడ్డి నేతృత్వంలో జిల్లా అధికారులు


నెల్లూరులో జిల్లా అధికారుల ర్యాలీ.

కలక్టరేట్ వద్ద ప్రదర్శన నిర్వహించారు. 19వ తేది జిల్లా అధికారులు, గెజిటెడ్ అధికారులు అంతా కలసి ఆత్మకూరు బస్టాండ్ వద్ద గల పొట్టి శ్రీరాములు విగ్రహం వద్ద సమావేశమై అక్కడ నుంచి కలక్టరేట్ వద్దకు ర్యాలీగా వచ్చి కలక్టర్‌కు వినతి పత్రం సమర్పించారు. 20వ తేది జిల్లా అధికారులు మధ్యాహ్న భోజన సమయంలో నిరసన ప్రదర్శన, 21వ తేది పెన్‌డౌన్, 22వ సామూహిక సెలవుపెట్టి తమ నిరసన తెలియజేశారు. అయితే ఈ నిరసనలో జిల్లాలోని ఆర్డీఓలు పాల్గొనక పోవడం ప్రత్యేకంగా చెప్పుకోవాలి.

అయితే ఎంసెట్ కౌన్సిలింగ్ ఇబ్బంది లేకుండా జరిగేందుకు గెజిటెడ్ అధికారులు అందించిన సహకారమే కారణమనక తప్పదు. ఈ వ్యవహారమై విమర్శ రేగినా ఆ రోజుకు తాము విధులు బహిష్కరించలేదని గెజిటెడ్ అధికారులు సర్ది చెప్పుకొంటున్నారు. 22వ తేది నుంచి వారంతా సామూహిక సెలవు పెట్టడంతో ప్రభుత్వ కార్యాలయాలు పూర్తిగా స్తంభించాయి.

# ప్రైవేటు బస్సుల దోపిడీ!


విపరీతంగా ఛార్జీలు వసూలు చేస్తున్న ప్రైవేటు బస్సులు.

సమైక్యాంధ్ర ఉద్యమ ప్రభావం ప్రజల జీవితాలపై చాలా ప్రభావాన్ని చూపుతోంది. ముఖ్యంగా రవాణా వ్యవస్థపై ఉద్యమ ప్రభావం అధికంగా వుంది. ఎన్‌జిఓలు, విద్యార్థులు ఉద్యమాన్ని తీవ్రతరం చేస్తున్నారు. ఆర్టీసి కార్మికుల బంద్‌తో చాలా చోట్ల ఆర్టీసి బస్సులు తిరగడం లేదు. రాకపోకలకు తీవ్ర ఆటంకాలు ఎదురౌతున్నాయి. ముఖ్యంగా హైదరాబాద్‌కు తిరిగే బస్సుల్లో రద్దీ ఎక్కువగా వుంటోంది. దీన్ని అవకాశంగా చేసుకొని బస్సు ఆపరేటర్లు ప్రయాణీకులను నిలువునా దోచుకొంటున్నారు. టిక్కెట్ ధరలను అమాంతం రెండింతలు, మూడింతలు పెంచి పారేశారు. నాన్ ఎసి బస్సుల్లో 250 రూపాయలుగా వున్న బస్సు ఛార్జీ 550 రూపాయలుగా చేశారు. ఎసి బస్సుల్లో 500 రూపాయలుగా వున్న బస్సు ఛార్జీని 1200 రూపాయలుగా, సెమీ స్లీపర్‌లో 800 రూపాయలుగా వున్న టిక్కెట్ ధరను 1100 రూపాయలుగా వారి ఇష్టానుసారంగా వసూలు చేస్తున్నారు. బస్సు యాజమాన్యాలు ఇంత బహిరంగంగా ప్రయాణీకులను ఛార్జీల పేరుతో నిలువుదోపిడీ చేస్తున్నా అధికారులు ఎవరూ పట్టించుకోకపోవడంతో హైదరాబాద్ నుంచి నెల్లూరుకు, నెల్లూరు నుంచి హైదరాబాద్‌కు వెళ్లే ప్రయాణీకులు ఇంతింత ధర పెట్టి టిక్కెట్లు కొనలేక అధిక భారంగా మారడంతో తీవ్ర అసౌకర్యానికి గురౌతున్నారు. బెంగుళూరుకు నడిచే బస్సులు సైతం అధిక ఛార్జీలబాటే నడుస్తున్నాయి.

# ఎస్టీ సర్పంచ్‌కు అవమానం!

**● గ్రామ కార్యదర్శి వైఖరి మూలంగా జెండా ఎగురవేయలేక పోయింది**

స్వాతంత్ర్య దినోత్సవం నాడు ఓ మహిళా సర్పంచ్ అవమానానికి గురి కావాల్సి వచ్చింది. అల్లూరు మండలం నార్తుమోపూరు గ్రామ పంచాయతీ కార్యాలయంలో స్వాతంత్ర్య దినోత్సవం పురస్కరించుకొని జాతీయ జెండా ఎగురవేయాలని నిర్ణయించారు. తొలిసారిగా సర్పంచ్ ఆధ్వర్యంలో జరిగే ఈ కార్యక్రమాన్ని ఘనంగా చేయాలని భావించిన సర్పంచ్ కార్యదర్శి వైఖరి కారణంగా నిరాశ చెందాల్సి వచ్చింది. జెండా ఆవిష్కరణ కార్యక్రమానికి ప్రతి ప్రభుత్వ ఉద్యోగి హాజరు కావాల్సి వుంది. కానీ నార్తుమోపూరు కార్యదర్శి మాత్రం స్వాతంత్ర్యదినోత్సవ కార్యక్రమానికి హాజరు కాకపోవడం పట్ల గ్రామస్తులు ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారు. రిజర్వుడు కేటగిరిలో గిరిజన మహిళ సర్పంచ్‌గా ఎన్నికైంది. ఇక్కడ కార్యదర్శిగా విధులు నిర్వహిస్తున్న వ్యక్తి ఇతర కులానికి చెందిన వాడు కావడంతో కొంత వివక్ష చూపుతున్నాడని సర్పంచ్ వాపోతుంది. గ్రామ పంచాయతీకి సంబంధించిన పూర్తి వివరాలను కొత్తగా ఎన్నికైన సర్పంచ్‌కు వివరించాల్సిన బాధ్యత కార్యదర్శిపై వుంటుంది. అయితే కార్యదర్శి సక్రమంగా విధులకు హాజరు కాకపోవడం, క్యాంపుల పేరుతో బయట తిరుగుతుంటాడని గ్రామస్తులు చెబుతున్నారు. తమ గ్రామ ప్రజలకు సర్పంచ్‌గా సేవ చేయాలన్న సంకల్పానికి ఆదిలోనే అడ్డు తగులుతుండడంపై వారంతా తీవ్రం ఆగ్రహంగా వున్నారు.

● మూలస్థానేశ్వర దేవస్థానం

# ఛైర్మన్‌గా ఆల్తూరు గిరీష్‌కుమార్‌రెడ్డి!


అభినందన వేదికపై గిరీష్‌కుమార్‌రెడ్డితో అతిరథమహారథులు.

నెల్లూరు మూలపేటలోని భువనేశ్వరి సమేత మూలస్థానేశ్వర స్వామి దేవస్థానం ఛైర్మన్‌గా ప్రముఖ పారిశ్రామికవేత్త, ఏయంఆర్ గ్రూప్ అధినేత ఆల్తూరు గిరీష్‌కుమార్‌రెడ్డి ప్రమాణ స్వీకారం చేశారు. ఈ సందర్భంగా 19వ తేది శివాలయంలో ఆత్మీయులు ఆయనకు ఘనంగా అభినందన సభ ఏర్పాటు చేశారు. ఈ సందర్భంగా గిరీష్‌కుమార్‌రెడ్డి మాట్లాడుతూ ఘన చరిత్రగల్గిన దేవస్థానానికి తాను ఛైర్మన్‌గా ఎన్నిక కావడం తన పూర్వ జన్మ సుకృతమని, ఆలయ అభివృద్ధికి తన శక్తి మేర కృషి చేస్తానన్నారు. సరస్వతీ విగ్రహాన్ని జరిపి, నూతన హంగులతో నిర్మిస్తానని, దేవాలయం వద్ద పార్కింగ్ ఇబ్బందులను తొలగించేందుకు పార్కింగ్ వసతి కల్పిస్తానని, స్వామివారి కోనేరును పర్యాటక కేంద్రంగా మార్చేందుకు కృషిచేస్తానని తెలిపారు. ఆలయంలోని దుర్గమ్మ సన్నిధిని సుందరంగా తీర్చిదిద్దుతానన్నారు. ఈ కార్యక్రమంలో ఎమ్మెల్యేలు ఆనం వివేకానందరెడ్డి, ముంగమూరు శ్రీధర్ కృష్ణారెడ్డి, పారిశ్రామికవేత్త వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డి, ఆలయ కమిటీ సభ్యులు డేగా జనార్దన్‌రెడ్డి, ప్రసాద్, డి.నరసింహారావు, గ్రంధి వెంకటేశ్వరరావు, బి.విజయకుమార్, గొల్ల బాబూరావు, మురళి, టి.విజయలక్ష్మి, దేవాదాయ శాఖ అసిస్టెంట్ కమిషనర్ వేగూరు రవీంద్రరెడ్డి, ఇఒ, కోవూరు జనార్దన్‌రెడ్డి, ఆల్తూరు ఆదినారాయణరెడ్డి, చాట్ల నరసింహారావు, పత్తి బాబు తదితరులు పాల్గొన్నారు.

## ఉద్యమాన్ని రాజేసిన ఉద్యోగులు

16వ పేజీ కొరవ

ఉస్మానియా, నిమ్స్ వంటి ప్రభుత్వ ఆస్పత్రుల స్థాయిలో ఆంధ్రప్రాంతంలో వసతులు లేని మాట నిజం. కానీ రాష్ట్ర విభజనకు అదొక అడ్డంకి అనడం సమంజసం కాదు.

### విద్యా సంస్థల నష్టం అపారం

నిజం చెప్పాలంటే, ఆస్పత్రుల కంటే విద్యా సంస్థల విషయంలో ఆంధ్ర ప్రాంతం అధికంగా నష్టపోతుంది. గత యాభైఏళ్లలో కేంద్ర నిర్వహణ లోని విద్యా సంస్థలు పరిశోధనా సంస్థలన్నీ హైద రాబాదులోనే నెలకొన్నాయి. అది మన రాజధాని కాబట్టి ఎవరూ అభ్యంతరం పెట్టలేదు. మా ప్రాంతా నికి కావాలని అడగలేదు. వీటిలో లక్షలాది మంది విద్యార్థులు ఉన్నత విద్య చదువుతున్నారు. ఈ సంస్థలు రేపు లోకల్ నాన్ లోకల్ అనే తేడా చూపితే మాత్రం విద్యార్థులు కోలుకోలేనంత నష్ట పోతారు. విభజన అంటూ జరిగితే, వేర్పాటు చర్చ లలో నీళ్ల తర్వాత అధిక ప్రాధాన్యత ఇవ్వాల్సిన అంశం ఇది.

### ఐటి పరిశ్రమ మనకు రాదు

సత్యం రామలింగరాజు, చంద్రబాబు నాయు దుల పుణ్యాన హైదరాబాదు నగరం ఐటి పరిశ్ర మకు రాజధానిగా మారింది. బెంగుళూరు, పూనా లను మించి అక్కడ ఐటి పరిశ్రమ పురోగతి సాధిం చింది. లక్షలాది మందికి ఉద్యోగాలు కల్పించింది. కూలీ చేసుకొని బ్రతికే కుటుంబాలు కూడా అమెరి కాలో స్థిరపడే స్థాయి కల్పించింది. మన రాష్ట్రానికి జరిగిన మహోపకారం ఇది. రాష్ట్ర విభజన అంటూ జరిగితే, ఆంధ్ర ప్రాంతంలో ఈ స్థాయిలో ఐటి పరిశ్రమ అభివృద్ధి అనేది కలలోని మాట. ఈ లోపం మాత్రం ఎన్నేళ్లయినా ఆంధ్ర ప్రాంతం ఎదు ర్కోక తప్పదు. అయితే అంత మాత్రాన, ఆంధ్ర ప్రాంత యువతకు ఐటి ఉద్యోగాలు రావు అనే ప్రచారం తప్పు. ఐటి కంపెనీలు ప్రతిభ ఆధారంగా ఉద్యోగాలిస్తాయే తప్ప ప్రాంతాలను చూసి కాదు. హైదరాబాదులో ఇప్పటి వలెనే మన వాళ్లకు ఉద్యో గాలు వస్తాయి అయితే ఈనాటి వరకు మన రాజ ధానిలో వున్నామనే మానసిక భావన వుంది. ఇక నుంచి పరాయి రాష్ట్రంలో గడుపుతున్నామనే మాన సిక ఎడబాటు వుంటుంది.

మరొక కోణం నుంచి ఆలోచిస్తే, ఇది కూడా ఆంధ్ర ప్రాంతానికి ఒక అనుకూలతే. ఇప్పటి వరకు హైదరాబాదులో పని చేసే ఐటి ఉద్యోగులు అక్కడే ఇల్లు, వాకిలీ సమకూర్చుకొంటున్నారు. ఇక నుంచి వారు ఉద్యోగం హైదరాబాదులో చేసినా, ఆస్తులు తమ స్వంత వూరిలో కొనడానికి ప్రాధాన్యత ఇస్తారు. దానివల్ల ఆంధ్ర ప్రాంతంలో నగరాల అభివృద్ధి మరింత వేగం అందుకొంటుంది.

## ఆంటోనీ కమిటీ కాదు గోడ కమిటీ

తెలంగాణ విషయంలో సీమాంధ్ర కాంగ్రెస్ వాదుల అభిప్రాయాలు తెలుసుకోవడానికి కేంద్ర రక్షణ మంత్రి ఆంటోనితో నియమించిన కమిటీ పట్ల ఆంధ్ర నేతలెవరిలోనూ నమ్మకం లేదు. ఆంటో నీకి ఒక విలక్షణ అలవాటు వుంది. ఆయన ఎవరు ఏమి చెప్పినా వింటాడు. గంటల తరబడి ఓపిక పడుతాడు. కానీ తన మనసులోని మాట మాత్రం పొరపాటున కూడా బయటకు చెప్పడు. ఔను, కాదు అనే సమాధానం కూడా రాదు. ఆయనతో చెప్పు కోవడం కంటే గోడతో చెప్పుకోవడం మేలని అం టారు. అందువల్లనే ఆంధ్ర కాంగ్రెస్ వాదులు ఇది ఆంటోనీ కమిటీ కాదు, గోడ కమిటీ అని చలోక్తులు విసురుకొంటున్నారు. గతంలో ఇటువంటి సంక్లిష్ట సమయంలో ట్రబుల్‌షూటర్‌గా ప్రణబ్ ముఖర్జీ వ్యవ హరించే వాడు. అయితే ఆయన దారివేరు. ఆయ నకు ఏదైనా బాధ్యత అప్పచెప్తే, ఏళ్ల పూళ్లు సాగదీ యడం ద్వారా ఆ సమస్య దానంతట అది పరిష్కార మయ్యేట్లు చూసే వాడు. తెలంగాణ మీద ఆయనతో 2005లోనే కమిటీ ఏర్పాటైంది. కానీ 2012లో రాష్ట్రపతి పదవి చేపట్టే వరకు కూడా ఆ కమిటీ సమావేశం జరగలేదు. ఏ నిర్ణయం చెప్పలేదు. అది ప్రణబ్ ప్రత్యేకత. ఇది ఆంటోనీ ప్రత్యేకత.

## కిరణ్‌కుమార్‌రెడ్డి వైఖరి

మొదటి పేజీ కొరవ

కారులకు స్పష్టమైన సంకేతాలిచ్చాడు. పోలీసును అన్ని విధాల నిగ్రహించాడు. ఇందిరమ్మ, రాజీవ్ గాంధీ విగ్రహాలు కూలగొడుతున్నా సహించాడు. ఒక్కరి మీద కూడా కేసు పెట్టలేదు. మరొక ప్రక్క జగన్ పార్టీ తరపున వైఎస్‌విజయమ్మ నిరసన దీక్షకు దిగడాన్ని సైతం అనుమతించాడు. ఉద్యమ ఆవేశాలు పెట్రేగిపోతున్న సమయంలో విజయమ్మ వంటి మహిళ దీక్షకు దిగితే రాష్ట్రంలో విపరీత పరి ణామాలు జరిగే ప్రమాదం వుందని పోలీస్ ఉన్నతా ధికారులు హెచ్చరిక చేసినా ఆయన లెక్క చేయ లేదు. అయితే జనంలో సమైక్యం మీద అంత ఆవేశ మేమీ లేదు కాబట్టి విజయమ్మ దీక్ష ఒక మామూలు రాజకీయ కార్యక్రమంగా జరుగుతుందే తప్ప ఉద్య మాలలో కన్పించే ఆవేశకావేశాలు వ్యక్తం కాలేదు. నిజానికి ఇప్పుడు విజయమ్మ తనను పోలీసులు ఎప్పుడు అరెస్ట్ చేస్తారా అని ఎదురు చూస్తున్నది. కానీ ముఖ్యమంత్రి మాత్రం మరికొంత కాలం వేచి చూద్దాం అనే ధోరణిలో వ్యవహరిస్తున్నాడు.

ఆంటోనీ కమిటీ ముందు కిరణ్‌కుమార్‌రెడ్డి వాదన చాలా ఘాటుగా ఉందని వినికిడి. రాష్ట్ర విభ జన జరిగితే పరిష్కరించలేని సమస్యలు అసంఖ్యా కంగా చుట్టుముడుతాయని ఘంటాపథంగా వాదిం చాడట. ఆ తర్వాత సోనియా, రాహుల్ సమక్షంలో సైతం ఆయన తన మనసులోని మాటను కుండ బ్రద్దలు కొట్టినట్లు చెప్తున్నారు. తెలంగాణ ఇస్తే, రాష్ట్రంలో కాంగ్రెస్ ఆచూకీ దొరకదని, తాను పార్టీలో కొనసాగి ప్రయోజనం వుండదని అన్నాడట. తాము తెలంగాణ ఇవ్వడానికే నిర్ణయం తీసుకొన్నామని రాహుల్‌గాంధీ స్పష్టంగా చెప్పిన తర్వాత కూడా కిరణ్ ఆ ధోరణిలో మాట్లాడడం నిజంగా ధైర్యమే.

కిరణ్ ఇంతగా సమైక్య నినాదాన్ని భుజానికెత్తు కోవడానికి కారణం ఏమిటో ఎవరూ వూహించలేక పోతున్నారు. ఆయనలో ఒక ధైర్యం వుండాలని వూహ. తెలంగాణ ఇచ్చినా ఇవ్వకపోయినా రాష్ట్రంలో వున్న రాజకీయ పరిస్థితులు, జగన్ ప్రాభవం, ధరల పెరుగుదల, కేంద్ర ప్రభుత్వ అవినీతి కుంభకో ణాలు, మోడి ప్రభంజనాల వల్ల కాంగ్రెస్ గెలిచే అవకాశమే లేదు. ఎన్నికలకు ఇక మిగిలింది ఆరు నెలలు మాత్రమే. ఈ కొద్ది కాలంలో ముఖ్యమం త్రిని తప్పించే సాహసం కాంగ్రెస్ పెద్దలు చేయక పోవచ్చు. అందువల్ల తన పదవి పదిలం. కాకపో యినా ఇప్పటికే చెన్నారెడ్డి, జనార్దన్‌రెడ్డి, విజయ భాస్కర్‌రెడ్డి వంటి హేమాహేమీల కంటే అధిక కాలం ముఖ్యమంత్రిగా కొనసాగి రికార్డ్ సృష్టించాడు. ఈ కొద్ది కాలం పదవి కోసం తలదించుకోవడం కంటే సమైక్యాంధ్ర కోసం పోరాడిన వీరుడిగా ప్రజల దృష్టిలో ప్రతిష్ఠ సంపాదించాలన్న ఆలోచన ఆయ నలో వున్నదని వినికిడి.

### రాష్ట్రపతి పాలన తప్పదా?

తెలంగాణ ఏర్పాటుకు సహకరించమని, అన్ని వర్గాల ప్రజలకు నచ్చ చెప్పమని, ఉద్యమాన్ని నిరు త్సాహ పరచమని కిరణ్‌కుమార్‌రెడ్డిని ఆదేశించింది సోనియాగాంధీ. ఆ మాట ఆయన వింటాడా వినడా అన్నది వేరే ప్రశ్న. వింటే ఇబ్బంది లేదు. వినకుంటే మాత్రమే రాష్ట్రపతి పాలన పెట్టి అయినా పరిస్థితి అదుపు చేయాలని సోనియా నిర్ణయించుకొన్నట్లు తెలుస్తున్నది. గవర్నర్ నరసింహన్‌ను ఇప్పటికే ఈ విషయమై ఒక నివేదిక కోరినట్లు సమాచారం. కేంద్ర మంత్రి జైపాల్‌రెడ్డి ఎప్పుడూ లేనిది గవర్న ర్‌ను కలవడం వెనుక కారణం ఇదే అని తెలుస్తు న్నది. తెలంగాణ, సమైక్యాంధ్ర ఉద్యమాలలో వున్న తేడా ఏమిటి, నిజంగా ప్రజలు సమైక్యాంధ్ర కోరుకొం టున్నారా లేక రాజకీయం కోసం నడిపిస్తున్నారా, ప్రజలకు రాష్ట్ర విభజన పట్ల నచ్చ చెప్పడం ఎట్లా వంటి అంశాలతో నివేదిక ఇమ్మని గవర్నర్‌ను కోరా రట. సాధారణంగా ముఖ్యమంత్రి ఇటువంటి నివేదిక లివ్వాలి. కానీ కిరణ్ ఒక పక్షం మాట్లాడుతున్నాడు కాబట్టి ఆ బాధ్యత గవర్నర్‌కు అప్పచెప్పారు.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

### శంకర మఠంలో చండీ హోమం!

నెల్లూరు మూలపేటలోని శంకర మఠం నేతృ త్వంలో సర్వజనుల సుఖశాంతులు, సౌభాగ్యాలు కోరుతూ 20వ తేది చండీ హోమం నిర్వహించారు. భీమవరానికి చెందిన సోమేశ్వరశర్మ నేతృత్వంలో ఈ యాగం జరిగింది. కంచి పీఠం ప్రతినిధి గుల్బర్గా శర్మ ఈ యాగాన్ని పర్యవేక్షించారు. ఆర్కాట్ ప్రభాకర శర్మ దంపతులు ఉభయకర్తలుగా వ్యవహరించారు.

### తెలుగు మహిళల వినూత్న నిరసన!

సమైక్యాంధ్రను కోరుతూ 21వ తేది నగ రంలో తెలుగు మహిళలు వినూత్న నిరసన తెలియ జేశారు. రాఖీ పండుగ కూడా కలసి రావడంతో జాతీయ రహదారిపై వెళ్లే వాహనాలను ఆపి డ్రైవ ర్లకు రాఖీలు కట్టి సమైక్యాంధ్ర ఆవశ్యకతను వివరిం చారు. ఈ కార్యక్రమం జిల్లా తెలుగు మహిళా అధ్య క్షురాలు అంచల వాణి నేతృత్వంలో జరిగింది. అం తకు ముందు తెలుగు మహిళలు నగరంలో ప్రద ర్శన నిర్వహించారు.

### పిడూరు వెంకటసుబ్బారెడ్డి మరణం



నెల్లూరులో రైస్ మిల్లుల ఏర్పాటులో ఎన లేని కృషిచేసిన పెనుబర్తి గ్రామ పెద్ద రైతు పిడూరు వెంకటసుబ్బారెడ్డి 16వతేది మరణించారు. నెల్లూరు రైసుమిల్లర్స్ అండ్ డీలర్స్ అసోసియేషన్ కోశాధి కారిగా చాలాకాలంగా పని చేసిన వ్యక్తి వెంకట సుబ్బారెడ్డి. రెడ్‌క్రాస్ ద్వారా పలు సేవా కార్యక్ర మాల్లో పాల్గొనేవారు. రాజకీయ నేతలు, అధికా రులతో సత్సంబంధాలు నెరిపేవారు. కాకుటూరులో ఎఫ్‌సిఐ గోదాముల నిర్మాణానికి తనవంతు సహక రించిన వ్యక్తి. ఇంతచేసినా నిరాడంబరంగా జీవిం చడం వెంకటసుబ్బారెడ్డికే చెల్లిందనాలి. ఆత్మీయు డిని కోల్పోయిన వారి కుటుంబ సభ్యులకు మా సానుభూతి.

## మాలతీ చందూర్!

9వ పేజీ కొరవ

స్వర్గీయ నెల్లూరు వెంకట్రామానాయుడు, బెజవాడ గోపాలరెడ్డి పురస్కారాలు ఇలా ఎన్నో అందుకు న్నారు. ఇటీవలె మాలతీ చందూర్ నవలల్ని విశ్లే షిస్తూ ప్రముఖ స్త్రీ వాద రచయిత్రి ఓల్గా " నవలా మాలతీయం" వెలువరించారు.

అవిశ్రాంతంగా అక్షరాలతో నిత్య సావాసం, విశ్వ అధ్యయనంతో ఎందరో పాఠకుల జీవితాల్లో వెలుగులు ప్రసరించిన ఈ అద్వితీయ, అపురూప రచయిత్రి 84వ ఏట చెన్నైలో క్యాన్సర్ వ్యాధితో పోరాడి ఆగష్టు 21తేదిన కన్ను మూశారు. తెలుగు సాహిత్యంలో ఒక సుదీర్ఘ యానం చేసిన ఆ విజ్ఞాన ప్రదాయిని ఆత్మకు శాంతి కలగాలని ఆశిద్దాం.

–పెరుగు రామకృష్ణ

## జనవాణి

2వ పేజీ కొరవ

వురు సర్పంచ్‌ల వెనుక అత్యధికమంది నయాధన స్వాములు వారి మద్దతుదారులున్నారు. పోటీలు జరిగిన పంచాయతీలలో సైతం పార్టీల ఎల్లలుదాటి, గ్రామాభివృద్ధితో పనిలేకుండా నాయకులు పైరవీలు చేసి గ్రామ స్వరాజ్యాన్ని తుంగలో తొక్కారు. స్థానిక నాయకులు కొనుగోలు చేయడం, గుడులు కట్టి స్తాం, ఇళ్లస్థలాలు ఇప్పిస్తాం అని డబ్బు ప్రవహింప జేశారు. ఒక్కొక్క ఓటుకు 500 రూపాయల నుండి 10వేల వరకు ఖర్చు చేశారు. మద్యం సంగతి చెప్ప బనిలేదు. చేతివృత్తులు నశించి, వ్యవసాయం నష్టమై గ్రామాలు అధ్వాన్నం వైపు పోతున్నాయి. గ్రామా లను యువతే కాపాడాలి.

పి.శ్రీరాములు ముంగమూరు

### ఇది అన్యాయం సోనియమ్మ!

సమైక్యాంధ్రను ముక్కలు చేయాలని ఒక గంట సమావేశమయ్యి కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ నిర్ణ యించింది. ఈ సమావేశంలో ఒక్క తెలుగువాడు పాల్గొనే అవకాశం లేకుండాపోయింది. ఇప్పటికీ వ్రాసుకొన్న ఉపన్యాసం చదివే సోనియాగాంధీ కాం గ్రెస్‌పార్టీ అధ్యక్షురాలు కావచ్చు. సిగ్గులేకుండా ఆమెకు మొక్కే వెన్నెముక లేని నాయకులు ఉండ వచ్చు. కాని భాషాప్రయుక్త రాష్ట్రంగా దేశంలో మొట్ట మొదటి రాష్ట్రంగా ఏర్పాటు చేసిన ఆంధ్రప్రదేశ్‌ను ముక్కలు చేసే హక్కు సోనియాగాంధీకి, ఆమె వంధి మాగధులు దిగ్విజయ్‌సింగ్, ఆంటోనీలకు లేదు. జగన్మోహన్‌రెడ్డిని రాష్ట్రంలో ఎదుర్కోలేక సోనియా గాంధీ ఈ విభజన ఎత్తుగడ వేశారు. హైదరాబాద్ నగరాన్ని అభివృద్ధి చేసుకోవడంలో రాళ్లు ఎత్తిన కూలీలు సీమాంధ్రులు. ఇప్పుడు హైదరాబాద్‌లో సీమాంధ్రులు వుండకూడదని వెళ్లిపొమ్మని వెర్రివా గుడు వాగడానికి కె.చంద్రశేఖర్‌రావు ఎవరు? సీమాంధ్రలోని రాజకీయ నాయకులంతా సమైక్య గణం పూరించి రాష్ట్రాన్ని నిలబెట్టకుంటే ప్రజలు వారిని క్షమించరు.

సి.సుజాత కర్నూలు

## పదరంగం -81

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | | | 4 | | 5 | | 6 |
| 7 | | | | 8 | | | | | |
| | | 9 | | | | 10 | | 11 | |
| | 12 | | | 13 | 14 | | | 15 | |
| 16 | | 17 | | | | | 18 | | |
| | 19 | | | 20 | | 21 | | | 22 |
| 23 | | | 24 | | | 25 | | | |
| 26 | | | | | 27 | | | | |
| 28 | | | 29 | | | | | 30 | |
| | | 31 | | | 32 | | | | |

**అడ్డం**

1. చెమట (4)
5. గుడ్డ, వస్త్రము (3)
7. కాపి, అసలు కాదు (3)
8. వాయువు (2)
9. తడబడిన షరాబు (3)
10. దగ్గరలో (3)
12. హల్లులలో మొదటిది (1)
13. స్వర్ణం (3)
15. అటునుంచి అబద్దం, అసత్యం (2)
16. అచ్చులలో మొదటిది (1)
17. సరికాదు (2)
18. తెలుగు వర్క్ (2)
19. మిరపకాయ రుచి (2)
20. మెస్మరిజం (4)
23. కలిమి కాదు, పేదరికం (2)
24. దంతం, టాక్స్ (2)
25. 'సరిగమ' తరువాత (4)
26. ఉత్థానము కాదు, పడిపోవడం (3)
27. మోసపు (3)
28. తలతెగిన వనము (2)
29. దిగులు (3)
31. వర్షం (2)
32. సీతాదేవి ట్విన్స్ (5)

**నిలువు**

1. గొప్పదనం (3)
2. క్రింద నుంచి పని, కార్యం (2)
3. పడిశం (3)
4. బిచ్చగాని సంచి (2)
5. వలతో కూడిన ప్రేమ (3)
6. తెలుగు నెట్, జాలం (2)
8. అతి ప్రేమ, వాత్సల్యం (3)
10. పూలను బంధించేది (2)
11. తెల్లని కాదు, బ్లాక్ (3)
14. పాటకత్తె (3)
17. వ్యాపారం, అమ్మకం (2)
18. గట్టి పట్టు (4)
19. కోరిక (4)
20. నేత్రం (2)
21. మోసగాడు (3)
22. నెల (3)
23. పూత మందు (4)
24. తడబడిన గునపము (4)
27. ఎటుచూసినా వయ్యారమే (3)
30. సన్నం కాదు (2)

**సమాధానాలు**

## పదరంగం -80

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 అ | వ | 2 ని | | | 3 పా | 4 త | 5 కి | | 6 ఫ్రి |
| తి | | 7 జ | 8 న | 9 నం | | 10 ల | కా | 11 రం | |
| వ | | 12 ము | స | లి | | పా | | 13 నే | 14 తి |
| | 15 పు | | | 16 మ | ను | గ | డ | | క |
| 17 ప | డ | 18 క | | | | | | 19 స | మ |
| | 20 మి | డ | 21 త | | 22 అ | వ | 23 తా | రి | క |
| 24 ఎ | | 25 లి | ప్త | 26 కా | లం | | డు | | |
| 27 కా | 28 డు | | | 29 కి | కా | ఏ | | 30 వృ | 31 ధా |
| 32 ఎ | లు | క | | 33 నా | ర | | 34 ప | శ్చి | మం |
| 35 కి | బా | | 36 ఎ | డ | ము | | 37 పా | కం | |

# సంక్షిప్త సింహపురి

## ఆర్డీఓ కార్యాలయాల్లో వసతులు కల్పించండి!

కొత్తగా ఏర్పాటుచేసిన ఆత్మకూరు, నాయుడుపేట ఆర్డీఓ కార్యాలయాల్లో ఆధునిక వసతులు ఏర్పాటు చేయాలని జాయింట్ కలెక్టర్ బి.లక్ష్మీకాంతం అధికారులను ఆదేశించారు. 16వ తేది జెసి క్యాంపు కార్యాలయంలో ఇరిగేషన్, ఆర్అండ్‌బి ఎస్ఇలు, ఆత్మకూరు ఇన్‌ఛార్జ్ ఆర్డీఓ కమలకుమారిలతో సమావేశం నిర్వహించారు. ఆర్డీఓ కార్యాలయాల్లో ఏఏ వసతులు ఉండాలో జెసి వివరించారు. వీటితోపాటు అతిథి గృహం కూడా ఉండేలా చూడాలన్నారు. ఈ కార్యాలయాల్లో పనులు పారదర్శకంగా జరిగేలా చూడాలని అధికారులను ఆదేశించారు.

## సమైక్యాంధ్ర కోరుతూ ముస్లింల ర్యాలీ!



సమైక్యాంధ్రకు మద్దతుగా జెండావీధి ముస్లిం యూత్ ఆధ్వర్యంలో 16వ తేది భారీ ర్యాలీ జరిగింది. శుక్రవారం నమాజ్ అనంతరం జెండావీధి, కోటమిట్ట, కామాటివీధి ప్రాంతాల నుంచి పెద్ద సంఖ్యలో ముస్లిం యువకులు ఈ ర్యాలీలో పాల్గొన్నారు. జెండావీధి అలామసీదు సెంటర్ నుండి ప్రారంభమైన ఈ భారీ ప్రదర్శన పెద్ద బజారు, బారకాసు, డైకస్‌రోడ్డు, లీలామహల్ మీదుగా గాంధీబొమ్మ సెంటర్‌కు చేరింది. ఈ సందర్భంగా సోనియాగాంధీ, కె.చంద్రశేఖర్‌రావు చిత్రపటాలను దహనం చేశారు. రాష్ట్రవ్యాప్తంగా వెల్లువెత్తుతున్న నిరసన ఉద్యమాలను దృష్టిలో వుంచుకొని రాష్ట్రాన్ని సమైక్యంగా ఉంచాలని డిమాండ్ చేశారు. సయ్యద్ ఉమర్, షేక్ మీరామొహియుద్దీన్, ఖలీల్, హయాత్‌బాష, రబ్బాని, జాఫర్ మొహియుద్దీన్, ఖలీల్, ఫజల్, మున్వర్ ఈ ప్రదర్శనకు నాయకత్వం వహించారు.

## సోమిరెడ్డి జమున స్మారక అవార్డు!

రచయిత్రి సోమిరెడ్డి జమున పేరుమీద ఆమె సోదరి డాక్టర్ పెళ్లకూరు జయప్రద ఇస్తున్న రాష్ట్రస్థాయి నానీల రచయితలకు ఇచ్చే అవార్డును ఈ యేడాది హైదరాబాద్‌కు చెందిన రచయిత డాక్టర్ వై.రామకృష్ణారావుకు ప్రకటించారు. ఆయన వ్రాసిన మనసు చిత్రాలు నానీల సంపుటికి ఈ అవార్డు లభించింది. ఈ అవార్డు కమిటీకి ప్రసిద్ధ కవులు దాస్యం సేనాధిపతి, మాడిశెట్టి గోపాల్, అడువాల సుజాత న్యాయ నిర్ణేతలుగా వ్యవహరించారు. సెప్టెంబరు నెల మూడవ వారం జరిగే సభలో అవార్డు గ్రహీతకు ప్రశంసాపత్రం, మెమొంటోతోపాటు ఐదువేల రూపాయల నగదు అందిస్తారు.

## ఆర్ఎంఎస్‌లో ఆగష్టు 15!



నెల్లూరు రైల్వే మెయిల్ సర్వీసు (ఆర్ఎంఎస్)లో స్వాతంత్ర్య దినోత్సవ వేడుకలు ఘనంగా జరిగాయి. ఈ సందర్భంగా తపాలా శాఖలోని వివిధ డివిజన్ల ఉద్యోగుల మధ్య ఇండిపెండెన్స్ డే కప్ క్రికెట్ టోర్నమెంట్ నిర్వహించారు. ఇందులో ఆరు డివిజన్లు పోటీపడగా ఆర్ఎంఎస్‌కు సంబంధించిన సింహపురి సోల్జర్స్ టీమ్ విజయం సాధించింది. టీమ్ కెప్టెన్ గౌరీశంకర్‌ను ఆర్ఎంఎస్ ఉద్యోగులు కత్తి రామచంద్రయ్య, పవన్, మునిశేఖర్, చక్రపాణి, మోహన్, అశ్విని, కెకె ప్రసాద్ అభినందించారు.

## ఆకట్టుకొన్న రెవిన్యూ ఉద్యోగుల నిరసన



కలక్టరేట్‌లో సమైక్యాంధ్రకు మద్దతుగా రెవిన్యూ ఉద్యోగుల సంఘం 16వ తేది చేపట్టిన నిరసన అందరినీ ఆకట్టుకొంది. ఉద్యోగులు కలక్టరేట్ ప్రధాన గేటు వద్ద నేలపై పడుకొని నిరసన తెలిపారు. ఈ సందర్భంగా ఉద్యోగుల సంఘం జిల్లా అధ్యక్షుడు షేక్ షఫీ మాలిక్ మాట్లాడుతూ ప్రభుత్వ ఉద్యోగులను సర్కార్ ఎన్నిరకాలుగా ఇబ్బంది పెట్టాలనుకొన్నా ఉద్యమం ఆగదన్నారు. 177 జిఓతోపాటు ఎస్మాలాంటి చట్టాలు సమైక్యవాదం ముందు కొట్టుకుపోతాయన్నారు. జీతాలు, జీవితాల కోసం ప్రాణత్యాగానికి కూడా సిద్ధంగా ఉన్నారన్నారు. సమైక్యాంధ్రపై ప్రభుత్వం స్పష్టమైన ప్రకటనచేసే వరకు ఆందోళన కొనసాగుతుందన్నారు. ఈ కార్యక్రమంలో సంఘం కార్యదర్శి కె.సతీష్, చెన్నయ్య, లాజరస్, మురళీధర్‌రాజు, ప్రసాద్ తదితరులు పాల్గొన్నారు.

## వేదవ్యాస స్కూల్‌లో స్వాతంత్ర్య దినోత్సవం

నెల్లూరు మాగుంట లేఅవుట్‌లోని వేదవ్యాస స్కూల్‌లో స్వాతంత్ర్య దినోత్సవపు వేడుకలు ఘనంగా జరిగాయి. స్కూల్ కరస్పాండెంట్ ఎపి బాలాజీ జాతీయ పతాకం ఎగురవేసి దేశానికి స్వాతంత్ర్యం తెచ్చిన యోధుల గూర్చి మాట్లాడారు. విద్యార్థులు వందేమాతరం గేయం, ఇతర దేశభక్తి గీతాలను ఆలపించారు. రిటైర్డ్ రైల్వే ఉద్యోగి ఖాన్ ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా విచ్చేశారు. వివిధ పోటీల్లో గెలుపొందిన విద్యార్థినీ, విద్యార్థులకు బహుమతులందించారు. ఈ కార్యక్రమంలో స్కూల్ డైరక్టర్ బాలాజీ, ఉపాధ్యాయనీ, ఉపాధ్యాయులు, విద్యార్థినీ, విద్యార్థుల తల్లితండ్రులు పాల్గొన్నారు.



రైతు లోకం

# ఎరోబిక్ వరి సాగు పద్ధతులు

గతవారం తరువాయి భాగం

**దిగుబడి:**

ఆరుతడి వరిలో సాధారణంగా వేసే మాగాణి వరి దిగుబడులతో పోల్చినప్పుడు సుమారు 80-90% దిగుబడులు పొందవచ్చు. సాగు ఖర్చు తగ్గి, అధిక ఆదాయం సాధించే అవకాశం వుంది.

**ఆరుతడి పద్ధతిలో వరిసాగు చేయడం వల్ల లాభాలు:**

1. తొలకరి వర్షాలను సద్వినియోగం చేసుకోవచ్చు.
2. నారుమడి, పెంపకం, నాట్లకు అయ్యే ఖర్చు తగ్గుతుంది.
3. చెరువుల క్రింద, కాలువల క్రింద సాగు చేసే పరిస్థితుల్లో నాట్లు ఆలస్యం కాకుండా సకాలంలో పంటను సాగు చేయవచ్చు.
4. పంట త్వరగా (వారం నుండి 10 రోజులు) ముందుగా కోతకు వస్తుంది.
5. పురుగులు, తెగుళ్ల సమస్య కొంత వరకు తక్కువ.
6. పంట పడిపోదు.
7. నీటిని ఆదా చేసుకోవచ్చు.
8. కోత యంత్రాలతో సులువుగా పంటకోత చేపట్టవచ్చు.

డాక్టర్ వై.సూర్యనారాయణ
ప్రధాన శాస్త్రవేత్త,
వ్యవసాయ పరిశోధనా స్థానం, నెల్లూరు.

**సమస్యలు:**

1. పంట తొలిదశలో దీర్ఘకాలిక వర్షాభావ పరిస్థితి సంభవించినట్లయితే పంట దెబ్బ తినే అవకాశం వుంది.
2. కలుపు ఉధృతి ఎక్కువ.
3. విత్తిన 45-50 రోజులకు సమృద్ధిగా నీరు పట్టి మాగాణి వరిలాగా సాగుచేయాలి లేని పక్షంలో దిగుబడి తగ్గే అవకాశం వుంది.

Regn.No. : RN 1156 / 57 J/Nellore/008/12-14
జమీన్‌రైతు

### సమైక్యాంధ్ర ఉద్యమాన్ని...

# రాజేసిన ఉద్యోగులు!



**సింహపురి పక్షపత్రిక సంపాదకుడు ఆకుల పురుషోత్తం బాబు కుమారుడు గుర్‌గావ్‌లోని మారుతీ సుజుకి ఇండియా లిమిటెడ్ కంపెనీలో అసిస్టెంట్ మేనేజర్ విజయకుమార్, పల్లవిల వివాహం 19తేది నెల్లూరు మినీబైపాసురోడ్డులోని జిపిఆర్ గ్రాండ్ కళ్యాణ మండపంలో జరిగింది.**

సమైక్యాంధ్ర ఉద్యమం రోజురోజుకూ ఉధృతమౌతున్నది. ప్రజల భావోద్వేగాలు తీవ్రమౌతున్నాయి. ఎన్జీఓల సమ్మెతో పాలన స్థంబించింది. అయ్యవార్ల సమ్మెతో బడులు మూత పడుతున్నాయి. ప్రైవేటు పాఠశాలలో కూడా చదువులు సాగడం లేదు. ఆర్టీసి బస్సులు తుప్పుపట్టి పోతున్నాయి. పల్లెల నుంచి ప్రయాణం మహా కష్టంగా మారుతున్నది. ఆటోలు వుండబట్టి సరిపోయింది కానీ, లేకుంటే పల్లెలకు, పట్టణాలకు సంబంధాలు పూర్తిగా తెగిపోయి వుండేవి. రాజకీయ పార్టీలు ఒకదానితో ఒకటి పోటీ పడి మరీ ఉద్యమ కార్యక్రమాలలో పాల్గొంటున్నాయి. ఎమ్మెల్యేలు నిరాహార దీక్షలకు దిగుతున్నారు. ఎమ్పీలు వూళ్లకు రావడమే మానుకొన్నారు. మంత్రులు హైదరాబాదు, ఢిల్లీల మధ్య చక్కర్లు కొడుతున్నారు. సాక్షాత్తు ముఖ్యమంత్రి కూడా ఎక్కడెక్కడ ఉద్యమం ఏ రీతిలో సాగుతున్నదీ ఆరా తీస్తూ, అదేపనిగా కాలక్షేపం చేస్తున్నాడు. అంతకు మించి ఆయనకు కూడా పని లేదు. మరొకప్రక్క ఉభయ ప్రాంతాల మధ్య విద్వేషాలు పొడసూపుతున్నాయి. ఒకరిని ఒకరు శత్రువులుగా చూసుకొనే ప్రమాదం కళ్ల ముందు కన్పిస్తున్నది.

## ఉద్యోగులదే గోలంతా

కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ తెలంగాణ ఏర్పాటు ప్రకటించిన తొలి రెండు వారాలలో ఉద్యమం ఇంత తీవ్రంగా లేదు. ప్రజలు పట్టీ పట్టనట్లు కన్పించారు. ఎన్జీఓలు వీధులలోకి వచ్చిన నాటి నుంచి పరిస్థితిలో మార్పు. అప్పటి నుంచే సమైక్యాంధ్ర అనే నినాదం జనం మనసులకు తాకింది. ఉద్యోగుల సమస్య సుఖంగా బ్రతుకుతున్న హైదరాబాద్ నగరం వదలిపోవడం ఇష్టం లేకపోవడం మాత్రమే. తమకెక్కడ బదలీలు జరుగుతాయో అనే భయంతో ఇంత గోల చేస్తున్నారు. కొన్నివేల మంది ఉద్యోగుల ప్రయోజనం కోసం కొన్ని కోట్ల మంది ప్రజలు ఆలోచన లేకుండా ఇటువంటి ఉద్యమాలలోకి లాగబడడం ఎంతవరకు సమంజసమన్న చర్చ ఒకటి వుంది. ఆ వివాదంలోకి మేము పోదల్చుకోలేదు. ఒక్కటి మాత్రం నిజం – ఉద్యోగుల వల్లనే ఉద్యమానికి ఒక సమగ్ర రూపం వచ్చింది.

## దొంగ రాజీనామాలు

ఎమ్మెల్యేలు, మంత్రులు దొంగ ఆటలు ఆడుతున్నారు. తమ పదవులకు రాజీనామా చేస్తున్నట్లు ప్రకటించనివాడు లేడు. కానీ దాని ఆమోదానికి కనీస ప్రయత్నం చేసినవారు లేరు. కనీసం తమ రాజీనామా పత్రాన్ని స్పీకర్‌కు పంపను కూడా లేదు. పత్రికలలో వార్తల కోసం మాత్రమే రాజీనామా. నిజంగా వారికి చిత్తశుద్ధి వుంటే, రాజీనామా చేసిన పక్కక్షణం నుంచి, అది ఆమోదం పొందినా పొందకపోయినా ప్రభుత్వ కార్యకలాపాలకు దూరంగా వుండాలి. జీతభత్యాలు తీసుకోవడం మానుకోవాలి. తమ పేరు వెనుక ఎమ్మెల్యే అనే తోక తగిలించుకోవడం మానాలి. కానీ ఒక్కరూ ఆ పని చేయడం లేదు. నిక్షేపంగా జీతాలు, భత్యాలు తీసుకొంటూ, అధికార లాంఛనాలన్నీ సుఖంగా అనుభవిస్తూ, ప్రజల వద్ద మాత్రం తాము సమైక్యాంధ్ర కోసం రాజీనామా చేసిన త్యాగధనులమని డప్పు కొట్టుకొంటున్నారు.

## సమైక్యం కోసమా – హైదరాబాదు ఆశతోనా?

ఇంతకూ ఉద్యోగులు కానీ, రాజకీయవాదులు కానీ ఉద్యమం చేస్తున్నది సమైక్యాంధ్ర కొనసాగాలన్న తపనతోనా లేక హైదరాబాదు మీద తమకమా అన్నది ప్రశ్న. తెలుగు తల్లిని ఖండఖండాలుగా నరుకుతారా అని హూంకరిస్తున్నారు. ఆ వెంటనే హైదరాబాదు ఉమ్మడి రాజధాని అయితే రాజీ పడతామంటున్నారు. మరికొందరు రాయల తెలంగాణ అయితే అభ్యంతరం లేదని ప్రతిపాదిస్తున్నారు. అంటే, సమైక్యాంధ్ర ఉద్యమ నిర్వాహకులకు సమైక్యాంధ్ర కావాలనే కోరిక ఏదీ లేదు. కానీ హైదరాబాదును వదలుకోవడానికి మాత్రం మనసు కష్ట పెట్టుకొంటున్నారు.

## ప్రజలలో కూడా అదే భావన

హైదరాబాదు వదలుకొంటే అక్కడ వుండే ఉద్యోగ అవకాశాలు తమకు దక్కకుండా పోతాయన్న భావన ప్రజలలో కూడా వుంది. సాఫ్ట్‌వేర్, మేనేజ్‌మెంట్ రంగాలలో దాదాపు నాలుగు లక్షల మంది వరకు పని చేస్తున్నారు అక్కడ. రాష్ట్రంలోని ప్రతి గ్రామం నుంచి ఎవరో ఒకరైనా హైదరాబాదు ఉద్యోగస్తులు కావడం వల్ల ఆ నగరం మీద ప్రజలలోనూ మమకారం పుడుతున్నది. రాష్ట్రం వేరు పడితే హైదరాబాదులో మన పిల్లలకు ఉద్యోగాలు వుండవని ఉద్యమకారులు చేస్తున్న ప్రచారం వల్లనే ఈ పరిణామం.

ఉద్యమాలలో ఆవేశం తప్ప ఆలోచన వుండదు. ఇక్కడా అంతే. తెలంగాణ విడిపోతే హైదరాబాదులో ప్రభుత్వ ఉద్యోగాలకు మన పిల్లలు అనర్హులౌతారన్నది నిజమే. కానీ ప్రైవేటు రంగంలోని ఉద్యోగాలకు రాష్ట్ర విభజనకు సంబంధం ఏమిటన్న యోచన ఒక్కరూ చేయడం లేదు. విప్రో కానీ, ఇన్ఫోసిస్ కానీ పిల్లల అర్హతలు చూసి ఉద్యోగాలు ఇస్తాయా లేక తెలంగాణ, ఆంధ్ర అన్న తేడాతో నియామకాలు చేపడతాయా? అది వీలయ్యే పక్షంలో మద్రాసులో, బెంగుళూరులో, పూనాలో, బొంబాయిలో ఆంధ్రులు ఉద్యోగాలు ఎట్లా చేస్తున్నారు? హైదరాబాదులో సాఫ్ట్‌వేర్ రంగంలో వున్న ఆంధ్రులెంతమంది, తమిళ, ఉత్తరాదివారు ఎంత మంది? మన వారి కంటే వారి సంఖ్యే అధికం.

## నిజమైన సమస్య నీళ్లు

సమైక్యాంధ్ర కోరదలిస్తే, రాష్ట్ర విభజన వల్ల మనకు నష్టం అంటూ జరిగితే – రాజధాని నగరం వల్ల కాదు కృష్ణ నీళ్ల వల్ల జరుగుతుంది.

రాయలసీమ మొత్తానికి, నెల్లూరు, ప్రకాశం జిల్లాలకు కృష్ణ నీళ్లు మాత్రమే ఆధారం. శ్రీశైలం, సోమశిల, కెసి కెనాల్, నాగార్జునసాగర్ వంటి ప్రాజెక్టుల మీద ఈ ఆరు జిల్లాల్లో లక్షలాది ఎకరాల సాగు ఆధారపడి వుంది. శ్రీశైలం ప్రాజెక్ట్ కుడి పక్క మాత్రమే నీటి తరలింపుకు మార్గం వుంది కాబట్టి, తెలంగాణ వాదులు పెద్దగా కృష్ణ నీళ్లను అడ్డుకోలేరనే అభిప్రాయం ఒకటి వుంది. అదొక భరోసా. అయితే రాష్ట్ర విభజన సందర్భంలో నీళ్లవాటాలు పంపకం జరుగుతుంది కాబట్టి, కేవలం కృష్ణ వరద నీటి మీద ఆధారపడిన రాయలసీమకు ఇదే సమయంలో నికర జలాల వాటా కేటాయింపు ప్రయత్నం చేసుకోవచ్చు. దానిపై లోతైనా సమగ్ర అధ్యయనం జరగాలి. మూడు ప్రాంతాల మధ్య ఒద్దిక కుదరాలి. ఇప్పుడు తేలికగా తీసుకొంటే ఇక శాశ్వతంగా రాయలసీమ, నెల్లూరు జిల్లాలు కృష్ణ నీటి మీద హక్కు కోల్పోతాయి. అందువల్ల రాష్ట్ర విభజనను అడ్డగించడం ద్వారా ఈ నీటి పంపకం చర్చ జరిగేట్లు చూసుకోవడం అవసరం.

అయితే విచిత్రంగా సమైక్యాంధ్ర ఉద్యమం నడుపుతున్న ఏ ఒక్క రాజకీయ పార్టీ కూడా ఈ విషయంలో కనీసపాటి చిత్తశుద్ధి చూపడం లేదు. ఏరాసు ప్రతాప్ రెడ్డి వంటి రాయలసీమ మంత్రులు మాత్రమే దీనిపై ఆందోళన చెందుతున్నారు. సరైన వివరాలతో ప్రజలలో అవగాహన పెంచడానికి ప్రయత్నం చేస్తున్నారు. ఎన్జీఓలైతే ఆ మాటే మాట్లాడడం లేదు. ఎన్జీఓలు, గెజిటెడ్ అధికారులలో ఇంజనీర్లు కూడా వున్నారు. నీటి విషయంలో వారికి అవగాహన వుంటుంది. కానీ వారి ధ్యాస మొత్తం హైదరాబాదు నుంచి తాము బదలీ కాకుండా చూసుకోవడం మీదనే వుంటున్నది. తమ స్వార్ధం కోసం సమైక్యాంధ్ర నినాదాన్ని విన్పిస్తున్నారు వారు.

## బడ్జెట్ మీద తప్పుడు ప్రచారం

రాష్ట్ర విభజన జరిగితే హైదరాబాద్ నుంచి వచ్చే రాబడి మొత్తాన్ని నష్టపోతామని, రాష్ట్ర బడ్జెట్‌లో అధిక భాగం హైదరాబాదు నుంచి మాత్రమే వస్తుందని ఒక ప్రచారం పెడుతున్నారు సమైక్యవాదులు. విభజన జరిగితే జనాభా ప్రాతిపదికన ఖర్చులు, పెన్షన్లు, జీతాలు వంటివి ఆంధ్రకు 60 శాతం, తెలంగాణకు 40 శాతం వెళ్తాయని; అదే రాబడి విషయం వచ్చేసరికి ఎవరి ప్రాంతంలో ఎంత రాబడి వుంటే అంత మాత్రమే కాబట్టి, మనకు 40 శాతం బడ్జెట్ నిధులు, తెలంగాణకు 60శాతం నిధులు వెళ్తాయని ఒక వాదన విన్పిస్తున్నారు.

ఇది సహేతుకమైన వాదన కాదు. మన బడ్జెట్‌లో ప్రధాన ఆదాయవనరులు – అమ్మకం పన్ను, ఎక్సైజ్ సుంకం, భూముల రిజిస్ట్రేషన్ ఫీజు, మోటారు వాహనాల రిజిస్ట్రేషన్ ఫీజు, గనుల మీద వచ్చే రాయల్టీ ముఖ్యమైనవి. రాష్ట్రంలో ఎక్కడ వ్యాపారం, పరిశ్రమ, గనుల త్రవ్వకం వున్నా ఆయా కంపెనీల ప్రధాన కార్యాలయం హైదరాబాదులో వుంటుంది కాబట్టి, అక్కడే పన్నులు కడుతున్నారు. అందువల్ల హైదరాబాదులో విపరీతంగా రాబడి వుంది అన్న అభిప్రాయం కల్గుతున్నది. రాష్ట్రం విడివడితే, ఏ రాష్ట్రంలో వ్యాపారం, పరిశ్రమ నడిపేవారు ఆ రాష్ట్రంలోనే పన్నులు కట్టాలి. అందువల్ల ఆంధ్ర ఏర్పాటు జరగగానే హైదరాబాదు రాబడి పాతాళానికి పడిపోతుంది. మన అమ్మకం పన్నులో సింహ భాగం పెట్రోల్ ఉత్పత్తుల మీద నుంచి వస్తుంది. ఇప్పుడు అదంతా హైదరాబాదులో కడుతున్నారు. రేపు ఆంధ్రాలో కడతారు. నిజానికి హైదరాబాదులో కానీ, తెలంగాణ మొత్తం మీద కానీ చెప్పుకోదగిన భారీ పరిశ్రమలు లేవు. పెట్రోల్ రిఫైనరీ లేదు. విశాఖ నగరంతో పోలిస్తే హైదరాబాదులో భారీ పరిశ్రమలు చాలా తక్కువ. హైదరాబాదులో ఫార్మా, ఐటి పరిశ్రమలున్నాయి. ఐటిలో అమ్మకం పన్ను అనేది వుండదు. ఒక్క ఫార్మా పరిశ్రమల ద్వారా వచ్చే రాబడిని మాత్రమే నష్టపోతుంది ఆంధ్ర. కానీ ఒక్క విశాఖ ఉక్కుతో పోలిస్తే, మొత్తం ఫార్మా పరిశ్రమలన్నీ కలిపినా పోలిక వుండదు.

## ఆస్పత్రుల సమస్య

సమైక్యవాదులు ఎత్తి చూపే మరొక ప్రధాన సమస్య – కార్పొరేట్ ఆస్పత్రులన్నీ హైదరాబాదులో వున్నాయని, క్యాన్సర్, గుండె, లివర్ వంటి జబ్బులకు మొత్తం రాష్ట్రం ఆ నగరం మీదనే ఆధారపడుతున్నదని, దాన్ని కోల్పోతే ఆంధ్రవాసులు ఆరోగ్యం కోసం ఎక్కడకు పోవాలని ప్రశ్నిస్తున్నారు వీరు. అది నిజం కూడా. అయితే ఆస్పత్రులు ఎక్కడ వున్నా, వాటి సౌకర్యాన్ని అందరూ వాడుకొంటారు. ఇప్పటికీ ఆంధ్ర ప్రాంతం నుంచి అధిక భాగం రోగులు మద్రాసు ఆస్పత్రులకే వెళ్లడం ఆనవాయితీ. మద్రాసు జనరల్ ఆస్పత్రిలో కూడా తెలుగు రోగులు అధిక సంఖ్యలో కన్పిస్తారు. మీది మా రాష్ట్రం కాదు కాబట్టి, మేము వైద్యం చేయమని తమిళులు ఏనాడూ అభ్యంతరం చెప్పడం లేదు. క్యాన్సర్ విషయంలో కూడా అధిక భాగం రోగులు హైదరాబాదు కంటే అడయార్ క్యాన్సర్ ఆస్పత్రి మీదే ఆధారపడుతున్నారు.

హైదరాబాదులోని నీలోఫర్, గాంధీ,

కొరవ 14వ పేజీలో

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com